సంకలనం

# కర్నూలు కవిత




ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం

జిల్లాశాఖ - కర్నూలు

# కర్నూలు కవిత

## • సంకలనం •

### సంపాదకులు

• డా॥ యం. జయరాం • కలం ప్రహ్లాద్

### సహ సంపాదకులు

• కొత్తపల్లి సత్యనారాయణ • ఎస్. ముర్తుజా

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం

జిల్లాశాఖ – కర్నూలు

# KURNOOL KAVITHA (Sankalanam)
## EDITED BY: Dr M. Jayaram, Kalam Prahlad

# కర్నూలు కవిత (సంకలనం)
## డా॥ యం. జయరాం, కలం ప్రహ్లాద్


ప్రచురణ సంఖ్య : 1

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : జూన్, 2015

కవర్ డిజైన్ : మారుతి గ్రాఫిక్స్, అంజి ఆర్ట్స్

డిటిపి : టి. సాయిబాబ, కర్నూలు. 75698 88092



ప్రతులకు : కలం ప్రహ్లాద్

యం.ఐ.జి. 141, ఏపిహెచ్‌బి కాలని,

ఆదోని-518 301.

కర్నూలు జిల్లా. ఆంధ్రప్రదేశ్

సెల్: 99853 55456

email: prahladkalam@gmail.com



ముద్రణ :

వెల : 100/-

# కాంతులీనుతున్న కర్నూలు కవిత

కర్నూలుసీమలోనే శ్రీశ్రీ మహాకవి అయ్యారు. 1950వ దశకంలో నంద్యాలలో జరిగిన ఎన్నికల సభలో కమ్యూనిస్టు నేత కామ్రేడ్ చంద్రరాజేశ్వరరావు శ్రీశ్రీని మహాకవి అని సంబోధించారు. ఆనాటి నుండి శ్రీశ్రీ మహాకవి గౌరవానికి పాత్రులైనారు. కర్నూలుజిల్లాకు చెందిన ఒకానొక సాహిత్య చారిత్రకాంశమిది.

తెలుగులోగిళ్ళకు విద్యుత్ కాంతులనందిస్తున్న కర్నూలుసీమ ఈ కవితా సంకలనం ద్వారా విద్వత్ కాంతులనందిస్తుంది. ఆధ్యాత్మిక క్షేత్రనిధి అయిన కర్నూలు సీమ యిప్పుడు ఆధునిక సాహిత్య కేంద్రంగా రూపుదిద్దుకొంటుందనడానికి ఈ సంకలనం ఒక ఆనవాలు.

ఈ సంకలనంలోని కవితలలో పల్లెనుంచి ప్రాపంచిక అంశాల దాకా ప్రస్తావనలున్నాయి. వైవిధ్య భరితమైన కవితలున్నాయి. కవులకు శుభాకాంక్షలు. జిల్లాలోని అన్ని ప్రాంతాల కవులను సమీకరించి వాళ్ళ కవితలనందిస్తున్న సంపాదక వర్గానికి అభినందనలు.

1936లో మన దేశంలో ఆవిర్భావమయిన అరసం 1943లో తెలుగువారికి పరిచయమయ్యింది. మన భాషా సాహిత్యాలకు అభ్యుదయ రచయితల సంఘం అందించిన సేవలు మహోన్నతమైనవి. సామ్యవాద వ్యవస్థ లక్ష్యంగా అరసం నిరంతరం పురోగమిస్తూనేవుంది. ఆ లక్ష్యసాధనలో భాగంగా కర్నూలుజిల్లా అరసం వెలువరిస్తున్న ఈ పుస్తకం కవితా కాంతులను వెదజల్లుతూవుంది.

ఈ విలువైన సంకలనానికి స్వాగతం పలుకుతున్నాను. కర్నూలు జిల్లా అరసం భవిష్యత్తులో మరిన్ని కార్యక్రమాలను నిర్వహించటంతోపాటు మంచి మంచి పుస్తకాలను వెలువరించగలదని ఆశిస్తున్నాను.

**– పెనుగొండ లక్ష్మీనారాయణ**
జాతీయ కార్యదర్శి – అరసం

# వర్తమాన భారతీయ చిత్రం
# కర్నూలు కవిత

### "కళకు కేంద్ర బిందువు మానవనవుడే" బి. సూర్య సాగర్

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం, కర్నూలు జిల్లా శాఖ మిత్రులు కర్నూలు జిల్లా కవుల కవితలతో ఒక సంకలనం తీసుకొని రావడం నాకు ఆనందంగా వుంది. డా|| ఎం. హరికిషన్‌గారి సంపాదకత్వంలో గతంలో కర్నూలు కథ వచ్చింది. ఇప్పుడు కవిత్వం సంకలనం రావడం కర్నూలు జిల్లా సాహిత్య చరిత్రలో మరో ముఖ్య ఘట్టం 'కర్నూలు కథ' కన్నా ముందు కథా సమయం, పల్లె మంగలి కథలు, ఫ్యాక్షన్ కథలు, ఐంద్రావతి కథలు వంటి చిన్నవి పెద్దవి కథా సంకలనాలు కూడా వచ్చాయి. కవిత్వ సంకలనం రావడం ఇదే మొదలేమో?

ఇదే మాదిరిగా తక్కిన రాయలసీమ జిల్లాలనుండి కూడా కవిత్వ సంకలనాలు వస్తే బాగుంటుంది. 2003లో కరువు కాలంలో నేను శాంతినారాయణ సంపాదకులుగా అప్పటి కరువు వస్తువుగా 'హొరుపు' అనే సంకలనాన్ని జిల్లా రచయితల సంఘం తరుపున తీసుకొచ్చాం.

ఇవాళ ఏ భావజాలం గలిగిప వారైనా, కవులు వర్తమానం గురించి రాయవలసినదే. ఈ పరిస్థితి అనివార్యం. గత ఏడెనిమిది దశాబ్దాల ప్రగతిశీల సాహిత్యం సంప్రదాయ వాదంపై సాధించిన విజయం ఇది. వెనకటి చూపుతో ఎవరన్నా ఏదన్నా రాసుకున్నా అది అత్మానంద విశేషంగా మిగిలిపోవలసిందే. గతంలో మునకవేసేవాళ్ళు చారిత్రక అవశేషాలుగా తచ్చాడుతూ ఉండవలసిందే. వర్తమానం గట్టు మీద నిలబడి సూర్యుణ్ణి చూసే వాళ్ళే ప్రజాబంధువులవుతారు.

ఈ సంకలనంలో ఇప్పటికే కవులుగా స్థిరపడినవాళ్ళు ఉన్నారు. మొలక కవులూ ఉన్నారు. ఇదొక కదంబం. రాసిన కవులందరూ కర్నూలు జిల్లా వారే అయినా, రాసింది మొత్తం వర్తమాన భారతీయ సమాజ జీవితం గురించే. స్త్రీల మీద జరుగుతున్నదాడులు, శ్రమ, పెరిగిపోతున్న జీవన వేగం, మాట, కవిత్వం, అరాచకత్వం, భిక్షాటన, సమసమాజం, దారితప్పి సమాజం, స్త్రీ శక్తి, రైతు, ప్రలోభం, సాంకేతి పరిజ్ఞానం, గ్రామాల విధ్వంసం, పారిశుద్ధ్య కార్మికులు, పర్యావరణం, వదులవుతున్న మానవ సంబంధాలు, ప్రపంచీకరణ, ఉగ్రవాదం, మత విద్వేషాలు, బాల్యం, రాజకీయం, శ్రమదోపిడి, తల్లిదండ్రులపై నిరాదరణ, కార్పొరేట్ విద్య, అవినీతి ఇలాంటివి ఈ కవులు స్వీకరించిన వస్తువులు. ఇవన్నీ నేటి వస్తువులే. అందుకే వర్తమానంలో నిలబడి వర్తమానం గురించి కవిత్వ సంభాషణ చేసిన కవులందరికీ అభినందనలు

ఈ కవితలన్నీ 68 ఏళ్ళ స్వతంత్ర భారత చరిత్రమీద, స్వపరిపాలనలోని మాయమీద, అపరిణత ప్రజాస్వామ్యం మీద కవులు చేసిన వ్యాఖ్యలు, కవులు వేసిన

ప్రశ్నలు, కవులు వేసిన మొట్టికాయలు, వర్తమాన సామాజిక పరిస్థితిగతుల పట్ల అసంతృప్తిలోంచి ఈ కవిత్వ కవాటాలు తెరచుకున్నాయి. "బుద్ధి చెప్పువాడు గుద్దితేనేమయా" అన్నట్లు ఈ కవులు ప్రత్యక్షంగానో పరోక్షంగానో నేటి రాజకీయ వ్యవస్థను నిలదీశారు.

యువతను ఉద్దేశించి అనేక కవితలు ఇందులో కనిపిస్తున్నాయి. అనేక కారణాల చేత దారి తప్పుతున్న యువతను, స్తబ్దంగా ఉన్న యువతను.... సరిదిద్ది, తట్టిలేపే ప్రయత్నం చేశారు కవులు. పుట్టుకతోగాని, పుట్టిన తర్వాతగాని వృద్ధులుగా మారిపోతున్న యువతను యువతగా నిలబెట్టే ప్రయత్నం అవసరమైనదే, అనివార్యమైనదే.

ఇది కలలు వాటి సాకారం గురించి మాట్లాడుకునే కాలం. అయితే ప్రతి కళాకారునికే అనివార్యంగా ఒక స్వప్నం ఉండడం చాలా సహజం. సామాజిక స్వప్నంలేని వాళ్ళు కళాకారులు కాలేరు. కళాకారులు ప్రగతిశీలవాదులైతే వర్తమాన సమాజం కన్నా మెరుగైన సమాజాన్ని కోరుకుంటూ, 'పదండి ముందుకు పదండి తోసుకు" అని ముందుకెళతారు. వాళ్ళు తిరోగమన వాదులైతే పదండి వెనకకు పదండి నెట్టుకు అని వెనిక్కి వెళతారు. వెనక్కి నడిచేవాళ్ళు మంచమెక్కుతారు. ముందుకెళ్ళేవారు కంచలు దాటుతారు. అడవులు, కొండలు, ఏరులు, ఎడారులా మన కడ్డంకి? అని దూసుకుపోతారు. ఈ సంకలనంలో 'పదండి వెనకకు' అని పిలుపునిచ్చిన కవులెవరూ కనిపించడంలేదు.

ఇందులోని కవితలు గాడి తప్పుతున్న రాజకీయాల్ని ఎత్తి చూసుతున్నాయి. వదులౌతున్న మానవ సంబంధాలను పటిష్టం చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. అనేక రకాల దోపిడీని ఎత్తి చూపుతున్నాయి, శ్రమ శక్తిని కీర్తిస్తున్నాయి. విడిపోతున్న జనాన్ని కలపడానికి ప్రయత్నిస్తున్నాయి. 'తమసోమా జ్యోతిర్గమయ' అనే సంప్రదాయ భావనకు ఆధునిక వ్యాఖ్యానాలు ఈ కవితలు. రావిశాస్త్రిగారు అన్నట్లు మంచికి విజయం, చెడుకు అపజయం ఈ కవులు కోరుకుంటున్నారు. ఈ కవులందరూ ప్రజలకు ఒక భరోసా ఇస్తున్నారు, మంచి సమాజం ఏర్పడుతుందని, అందుకోసం కొందరు కవులు శపథం కూడా చేశారు.

'స్వచ్ఛభారత్', 'దేశం వెలిగిపోతోంది', 'అంతా బాగుంది', 'స్వర్ణాంధ్రప్రదేశ్', 'హరితాంధ్రప్రదేశ్', 'స్వచ్ఛాంధ్రప్రదేశ్', 'ఆకర్షణాంధ్రప్రదేశ్' లాంటి పాలకవర్గ నినాదాలను ఈ కవితలు అభావం చేస్తున్నాయి. ప్రజల్ని మభ్యపెట్టే అబద్ధపు నినాదాలను పక్కన బెట్టి, కళ్ళ ముందు కనిపించే కఠిన వాస్తవాలను కళ్ళు తెరచి చూడమంటున్నాయి. పాలక నినాదాలకు ప్రజా కళాకారులకు ఎంత దూరముందో ఈ కవితలు రుజువు చేస్తున్నాయి. పబ్బం గడుపుకు పోయే పాలకులకు, ప్రజలను నడుపుకు వెళ్ళే కళాకారులకు వైరుధ్యం ఎక్కడుందో ఈ కవితలు చదివితే తెలుస్తుంది.

వర్తమానంపట్ల ఎంత అసంతృప్తి ఉన్నా ఈ కవులు ఎవరూ నిరాశావాదులు కాకపోవడం గమనించాల్సిన అంశం. నిరాశ మతం నూరిపోసే మత్తు. ఈ కవులలో మత విశ్వాసాలు కలిగిన వాళ్ళు ఎవరన్నా ఉన్నారో ఏమో, వాళ్ళ కవితలలో మాత్రం

నిరాశ కనిపించకపోవడం ఒక అనుకులాంశం.

ప్రతి తరం కవులూ తమ కవిత్వ లక్ష్యాన్ని తాము నిర్దేశించుకుంటారు. ప్రతి తరం కవులూ తమ సామాజిక కర్తవ్యాన్ని తాము నిర్దేశించుకుంటారు. సామాజిక నిబద్ధత గలిగిన కవులకు వాళ్ళ గమనం, గమ్యం అనుమానాలకు తావు లేకుండా కుదురుతాయి. ఈ సంకలనంలోని కవులకు చిన్న చిన్న తారతమ్యాలున్నా తమ గమనం, గమ్యం తెలుసు.

ఈ కవితలలో శిల్ప పరంగా పరిపక్వం చెందిన కవితలున్నాయి. కొంత సానబెట్టాల్సిన కవితలూ వున్నాయి. 'అటజని కాంచె భూమి సురుడు', 'అటజని కాంచెన్వైష్ణవుండు' అనే పద్యాలు నిరంతరం నెమరు వేసుకొనేవాళ్ళు, ఇవి కవితలేనా, ఇవి కూడా కవిత్వమేనా అని పెదవి విరవవచ్చు. విరవనిండు, విరవనిండు "మెచ్చుకుంటే మించి పాయెను" ఇవాళ కాకపోయినా వీళ్ళే రాటు దేలుతారు.

కొన్ని కవితలలో గేయ లక్షణాలు, గ్రాంథిక వాసనలు ఉన్నా ఎక్కువ కవితలు వచన కవితలు. వచనాన్ని నిరంతరం వచనం చేయడమొక్కటే కవులుగా నిలదొక్కు కోవడానికి మార్గం. అభ్యాసం కూసు విద్య అన్నదందుకే. వచన కవిత ప్రజాస్వామిక కవితకు చక్కని సాధనం. నూటా పదహారేళ్ళ ఆధునిక తెలుగు కవిత్వ వికాసంలో (ముసలమ్మ మరణం 1899–2015) ఈ కవితలు నేడు వికసించిన రేకులు. కట్టమంచి నుండి నేటి దాకా కవిత్వయాత్ర చేసిన, చేస్తున్న కవులతో 'ఈ కవులు చెట్టపట్టాల్ వేసుకుని' నడుస్తున్నారు.

అకాశపుదారులంట హడావిడిగా వెళ్ళిపోతున్న పాలకులను ఈ కవితలు భూమార్గం పట్టిస్తాయని ఆశిద్దాం. మారండర్రా అని ఈ కవులు చెబుతున్న మాటలు వాళ్ళకు వినిపిస్తాయని నమ్ముదాం. కవులుంటే, చెవులుంటే ఈ కవితల్ని కని, విని, మనసుంటే ఈ కవితల్ని చదివి మనవేం ఆలోచిస్తున్నాం, కవులే మంటున్నారు? అని ప్రశ్నించుకుంటారని అనుకుందాం. ఇలా అనుకోవడం తప్పు కాదు.

ఈ కవిత్వ సంకలనం తీసుకు రావడంలో కృషి చేసిన కర్నూలుజిల్లా అరసం అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు ఎం. జయరాం, కలం ప్రహ్లాదలకు, కార్యవర్గ సభ్యులకు, వీళ్ళకు సహకరించిన వాళ్ళకు, ఈ సంకలన కడవను తమ కవితలతో నింపిన కవులకు, ఈ పని చేయమని పురమాయించిన ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం పూర్వాధ్యక్షులు పెనుగొండ లక్ష్మీనారాయణ గారికి అభినందనలు. మిగతా జిల్లాల నుండి కూడా ఇలాంటి సంకలనాలు వస్తే అరసం కృషి సమగ్రమౌతుంది.

"రసజ్ఞత మాత్రము చావలేదు రాయలసీమలోపలన్' – నండూరి రామక్రిష్ణమాచార్య

**రాచపాళెం చంద్రశేఖరరెడ్డి,** అధ్యక్షులు,
ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం.
కడప, 27.02.2015. ఉదయం 4.00 గం॥లకు

# సందర్భం

'కర్నూలు కవిత' సంకలనాన్ని సాహితీ ప్రపంచంలోకి తీసుకొని వస్తున్న సందర్భంగా పాఠకలోకం కోసం అరసం కర్నూలు జిల్లా శాఖ తరుపున నాలుగు మాటలు. అభ్యుదయ రచయితల సంఘం (అరసం) కర్నూలు జిల్లాలో 2013 జనవరి 19న నాటి రాష్ట్ర అధ్యక్షులు, ప్రస్తుత జాతీయ కార్యదర్శి అయిన శ్రీ పెనుగొండ లక్ష్మీనారాయణగారి పర్యవేక్షణలో జిల్లాశాఖగా ఆవిర్భవించింది. నాటి నుండి జిల్లాలోని అనేక ప్రాంతాల్లో సాహితీ కార్యక్రమాల నిర్వహణకు మరియు అరసం బలోపేతానికి నిర్మాణాత్మక సూచనలు చేస్తూ, అనేక సాహితీ సభలలో పాల్గొంటూ మాకు అండగా నిలిచారు పెనుగొండవారు. జిల్లాలో అభ్యుదయ భావజాలంతో కూడిన సాహితీ వాతావరణాన్ని పెంచుటలో అరసం నిర్వహించాల్సిన పాత్రను వారు నొక్కి చెప్పారు. ఈ క్రమంలో ముందుగా కర్నూలుజిల్లా కవితా సంకలనం తీసుకు రావడంపై దృష్టిని కేంద్రీకరించమన్నారు. అంతేకాకుండా ఎప్పటికప్పుడు ఇందుకు అవసరమైన సూచనలను అందిస్తూ మార్గం సుగమం చేశారు.

అదే విధంగా అరసం నేటి రాష్ట్ర అధ్యక్షులు డా॥ శ్రీ రాచపాళెం చంద్రశేఖర రెడ్డి గారు ప్రధాన కార్యదర్శి శ్రీ వల్లూరి శివప్రసాద్‌గారు కర్నూలు జిల్లాలో అరసం బలమైన శక్తిగా ఎదిగి సామాజిక స్పృహను, చైతన్యాన్ని చాటిచెప్పుతూ ముందుకు సాగాలని అభిలషిస్తూ మాకు అన్ని విధాలుగా వెన్నుదన్నుగా ఉన్నారు. మరియు ఈ పుస్తకానికి 'కర్నూలు కవిత' అనే పేరును రాచపాళెంగారు సూచించడం సంతోషదాయకం.

కర్నూలుజిల్లా కవితా సంకలనం కోసం వివిధ రూపాల్లో విస్తృతంగా ప్రచారం నిర్వహించి 72 మంది కవులనుండి కవితలను సేకరించాము. ఇందులో అనుభవజ్ఞులైన కవుల కవితలతోపాటు ఇప్పుడిప్పుడే సాహితీ అనుబంధాన్ని బలపరుచుకుంటూ ముందుకు సాగుతున్న ఔత్సాహికులైన యువకవులకు కూడా చోటు కల్పించాం. వారు మునుముందు శాస్త్రీయ దృక్పథంతో, సామాజిక బాధ్యతతో, అభ్యుదయ భావజాలంతో సాహితీరంగంలో రాణించాలనేది మా అభిమతం. అంతేగాక కర్నూలుజిల్లాలో సాహితీ వాతావరణం విస్తరించడానికి, సుసంపన్నం కావడానికి కృషి చేస్తున్న సాహితీ సృజనకారులతో వీరు కలిసి నడుస్తారనీ మా ఆకాంక్ష. అందుకు ఈ సంకలనం కొంతైనా ఉపకరిస్తుందని మా నమ్మకం.

మా విన్నపం మేరకు ఈ పుస్తకానికి ముందు మాటలు రాసిన అరసం నేతలు డా॥ శ్రీ రాచపాళెం చంద్రశేఖర రెడ్డి గారికి, శ్రీ పెనుగొండ లక్ష్మీనారాయణ గారికి మా ప్రత్యేక కృతజ్ఞతాభివందనాలు.

ఈ సంకలనం కోసం మేము చేస్తున్న ప్రయత్నానికి మొదటినుంచీ చివరి వరకు తోడుగా నిలిచిన డా॥ శ్రీ ఎం. హరికిషన్ గారికి ప్రత్యేక కృతజ్ఞతలు. అలాగే సవ్వప్పగారి ఈరన్నగారు మాకందించిన అమూల్యమైన సహకారం కూడా మరవలేనిది.

సాహితీ కార్యక్రమాల నిర్వహణకు నిరంతరం మాకు సహకరిస్తున్న సి.పి.ఐ జిల్లా కార్యదర్శి కామ్రేడ్ కె. రామాంజనేయులు గారికి, నగర కార్యదర్శి కామ్రేడ్ ఎస్.ఎన్. రసూల్ గారికి మా కృతజ్ఞతలు.

సహకరించిన అరసం జిల్లా కార్యవర్గ సభ్యులు కె.సి. మల్లికార్జున, పుల్లా రామాంజనేయులు, మురళీ పడకండ్ల, నాగరాజు(ఎపిపిఎన్ఎం), శంకర్రావ్ గార్లకు కృతజ్ఞతలు. ఈ కవితా సంకలనాన్ని పాఠకులు ఆదరిస్తారని మా మనవి.

అభివందనాలతో...

| | |
|---|---|
| **డా॥ యం. జయరాం** | **కలం ప్రహ్లాద్** |
| అరసం జిల్లా అధ్యక్షులు | అరసం జిల్లా ప్రధాన కార్యదర్శి |
| కర్నూలు | కర్నూలు |

# లక్ష్య సాధన



**శిష్టు కృష్ణమూర్తి,**
**కర్నూలు.**
**94925 03768**

మూఢనమ్మకాల అంధకారాన్ని
పటాపంచలు చేస్తూ వస్తున్న
అభ్యుదయ భావ
సూర్యకిరణ కాంతిపుంజాన్ని
యువతా! తిలకించు.
నిరాశ, నిస్పృహల ఊబినుండి
యత్నించి, బయటపడి
ధీరులు కండి!
నిర్లిప్తత, నిష్క్రియత సుడుల
తాకిడి తట్టుకొని
ఉత్సాహం, నిరంతర క్రియాశీలతతో
ఉత్తేజితులు కండి!
వేగంగా, వెల్లువలా తరుముకొస్తున్న
పరిశోధనల సాంకేతికతను
సొంతం చేసుకొని
ప్రజాహితం ధ్యేయంగా
కొత్త పుంతల అన్వేషణకు
పరితపించండి!
యత్నం యువత అస్త్రం
అభ్యుదయం లక్ష్యం
ఇక తథ్యం మీ విజయం

# యవ్వనం



జి.వెంకటకృష్ణ, కర్నూలు.
89850 34894

యవ్వనం జవనాశ్వం

బుసలు విడిచే కాహాళ హాలాహలం

మధించే మేరుపర్వతం

పాలపరువం ఉప్పొంగే పీయూషం

యవ్వనం : ఎగిసిపడే సముద్రకెరటం

ఎలుగెత్తిన సింహధ్వానం

తుళ్ళింతల కోకిల గానం

యవ్వనం : అరచేతిలో స్వర్గం

జారవిడిస్తే పగిలే అద్దం

యవ్వనపు లేళ్ళ కొస ఈద

బొంగరంలా తిరుగుతుంది భూగోళం

చేయి చాపితే అందుతుంది విశ్వాంతరాళం

యవ్వనం కాదు బాత్రూంలో బూతు చిత్రం

వేధించే ప్రేమ పత్రం

కాదు కాదు ద్వేషం పొలికే యాసిడ్ పత్రం

యవ్వనం ప్రవహించే తీపి జ్ఞాపకం

అధిరోహించాల్సిన ఉల్లాస శిఖరం

నిర్మించాల్సిన రంగుల స్వప్నం

యవ్వనం పొగరెక్కిన ఈ దేశపు జెండా

# కర్మ ఏవ పూజా



**ఎస్. ముర్తుజా, నంద్యాల.**
**99855 43523**

పెందరాళే
ప్రార్థనకు వెళ్ళినప్పుడల్లా చూస్తుంటాను తనను ప్రతిరోజు
"కర్మ ఏవ పూజా" తన రివాజు
బజారునూడుస్తూ
దుమ్ము ధూళి భరిస్తూ కనిపిస్తుంటుంది తను
ముక్కుకింత గుడ్డైనా కట్టదు
తలకు కొంగైనా చుట్టదు
తదేకంగా పనిలో మునక తప్ప వేరేమి పట్టదు
మేమైతే చేతి రుమాళ్ళనమాంతం అడ్డుపెట్టుకొని,
ముఖమటుగా తిప్పుకొని,
పెద్ద పెద్ద అంగలేసుకుంటూ,
ఊపిరి బిగించి పట్టి పారిపోతుంటాం
నరకాన్నేదో దాటేసి వెళ్ళాలన్నంత ఆత్రంగా
నా కనిపిస్తుంది తనే గొప్ప భక్తురాలని
మా గుండెల నిండా కుళ్ళు కుతంత్రాలు
మస్తిష్కమంతా మాయా చిత్రాలు;
ఒంటి నిండా అత్తర్లు పులుముకుంటే సరా!
మానవత్వముండొద్దూ!
మా ఆడవాళ్ళైతే ఇళ్ళల్లో, ముంగిళ్ళలో
ఊడ్చినదంతా బజారులోనే పోస్తుంటారు
కార్యాలో కర్జాలో జరిగాయా! సరేసరి.
ఎంగిలాకు మొదలు అన్నింటికి ఆ బజారే బరి
అయితేనేం? తను విసుక్కోదు సుంతైనా
వేసారదు రవ్వంతైనా
కుళ్ళిన కుక్క కళేబరం ముందు మోకరిల్లిన
సిద్ధుడు గుర్తొస్తాడు తనను చూస్తుంటే
ఎందరో కర్మచారులకు తను ప్రతీక
పారిశుద్ధ్యానికి పతాక.

# సంజీవని



డా॥ ఎం. హరికిషన్, కర్నూలు.
94410 32212

మాట ఒక పరిమళం

కనబడినంతమేరా విస్తరించి

ఎండిన ఎదలో సైతం సుగంధాల్ని పూయిస్తుంది

మాట ఒక ఆసరా

మొలకెత్తని విత్తనాలలోనూ

జీవేచ్ఛని రగిలించి చిగురింప చేస్తుంది

మాట ఒక స్వేచ్ఛ

కరుకురాళ్ళని సైతం బద్దలు కొట్టుకొని

హద్దులు లేక అంతరిక్షాన్నంతా ఆక్రమిస్తుంది.

మాట ఒక ఆయుధం

వినబడని ఆర్తనాదాలన్నింటికీ పదును బెట్టి

పిట్టపిల్లల్ని సైతం ఎక్కుపెట్టిన బాణాల్లా మలుస్తుంది

మాట ఒక సంజీవని

పదకర్త నిష్క్రమించినా

కొత్త క్షేత్రాల్లో నాట్లు వేసుకొని

మొగ్గ తొడుగుతూనే వుంటుంది.

# ఒక్క అడుగు నేల



**పుల్లా రామాంజినేయులు,**
**మద్దికెర.**
**94918 51349**

మాకొద్దు
ఆదిమానవుడు అడిగిన
ఆరు అడుగుల నేల.
మాకొద్దు
వామనుడు అడిగిన
మూడు అడుగుల నేల.
మాకు కావాలి
మేము నిలబడేందుకు
ఒక్క అడుగు నేల...
భూమి కోసం, భుక్తి కోసం
సమ్మెకట్టి ప్రశ్నిస్తున్నప్పుడు
లాఠీలు మాపై నాట్యమాడినపుడు
విరిగిన ఎముకలు దాయటానికి,
అధిక ఫీజులకు వ్యతిరేకంగా
అధిక ధరలకు నిరసనగా
ధర్నాలు చేస్తుంటే
తుఫాకులు మాపై పేల్చినపుడు
మా నెత్తురు చూపటానికి,
వచ్చే విప్లవతరానికి
మా ఎముకలు నెత్తుటిమట్టి
ఆయుధాలు బహుమతిగా ఇవ్వటానికి,
మా జనం కోసం, మా జగతి కోసం
అధికారం తలదించి పారినపుడు
సమసమాజం నిర్మించుటకు
మాకు కావాలి
మేము నిలబడేందుకు
ఒక్క అడుగు నేల...

# అక్షర కెరటాలు



**కలం ప్రహ్లాద్,**
**ఆదోని.**
**99853 55456**

ఎదలోతుల్లో పెల్లుబికే భావాలను ఒడిసిపట్టి
మెదడుకు పట్టిన బూజును కట్టగట్టి విసిరివేసి
సాలుసాలు చక్కగా విత్తువేయు హాలికునిలా
ఉలినిబట్టి శిలను మలిచి రూపమిచ్చు శిల్పిలా
పోగు పోగు కలుపుకుంటూ బట్టనేయు నేతన్నలా
కమ్మరిలా, కుమ్మరిలా చెమటోడ్చుతూ
అధ్యయనం! అభ్యసనం! అవగాహనల పునాదిగా
సమసమాజ స్థాపనా లక్ష్యాన్ని గురిచూసి
కదిపిన కలం నుంచి...
అక్షరాలు కెరటాలై ఉవ్వెత్తున ఎగిసిపడును
చైతన్యపు చక్రాలై విశ్వమంత విహరించును
అలుముకున్న చీకట్లను చీల్చి వెలుగై ప్రసరించేను
ప్రజలను వంచించునట్టి పాలకుల పనిబట్టేను
ప్రపంచీకరణ విషవలయం పటాపంచలయ్యేను
నిస్సత్తువ యువతలోన చలనం కలిగించేను
పాతర బెట్టిన విలువలు పైకిలేచి పతాకమై ఎగిరేను
అంతేకాదు...
అభ్యుదయం ఆశిస్తూ అక్షర రూపం దాల్చిన
పదం పదం కవిత్వమే ప్రతిభావన కవిత్వమే
అదే అదే కథనమూ అదే అదే కవనమూ
అదేఅదే అదే... అదే మహాప్రస్థానం

# ఆహ్వానము



**సవ్వప్పగారి ఈరన్న,**
**పత్తికొండ.**
**9885115504**

నేను – అభ్యుదయాన్ని ఆహ్వానిస్తున్నాను...
అనంత విశ్వంలో...
అవగింజంత ఆత్మశాంతి కరువయ్యిందని....
విజ్ఞాన యుగంలో....
అజ్ఞానమే అంతటా అధికారం చెలాయిస్తుందని...
న్యాయ దేవత నాలుగ్గోడల మధ్య నల్గిపోతుందని...
శ్మశాన వాతావరణంలో ప్రశాంతత కరిగిపోతుందని...
రాబందుల రాజ్యంలో...
రాచరికాన్ని తలపిస్తూ...
అరాచకాలే అధికమౌతున్నాయని...
బంధాలు, అనుబంధాలు.
అడవుల పాలౌతున్నాయని...
నాగరికత ముసుగులో...
నగ్నత్వం నాట్యమాడుతుందని...
కరుడు కట్టిన కర్కష హృదయం...
కరాళ నృత్యం చేస్తుంటే...
కళ్ళప్పగించి చూస్తున్న కరుణాహృదయులు
అచేతనత్వాన్ని ప్రదర్శిస్తున్నారని...
యువకులు అడ్డదారుల్లో పయనిస్తూ...
భవితను భంగపరచుకుంటున్నారని...
శ్రీరంగనీతులకే శిరస్సులాడించుచున్నారని...
ఈ దుస్థితి ఏనాటికైనా మారితీరాలని
నేను అభ్యుదయాన్ని ఆహ్వానిస్తున్నాను.

# సిరితో సరినా?



డా॥ యం. జయరాం,
కర్నూలు
94401 07260

ధనం మూలం ఇదం జగత్
మనీమేక్స్ మెనీ థింగ్స్
డబ్బుకు లోకం దాసోహం
పైసామే హై పరమాత్మ
పైసాతో ప్రాణం పోయొచ్చు
అదే వుంటే ఏదీ లేకున్నా ఉన్నట్టే
అనుకుంటుందీ లోకం
స్నేహాలు, బంధుత్వాలు, స్వార్థాలు, త్యాగాలు
ఆత్మీయతలు, ఆప్యాయతలు అన్నీ అంతస్థులలోనే
చూసుకుందీలోకం
మనిషికి చివరికి అశాంతిని రేపేది?
మానవత్వపు విలువల్ని దిగజార్చేది?
మనుషుల మమతల్ని మటుమాయం చేసేది?
చివరికి మనిషిని హీనున్ని చేసేది?
ఈ ధనమేనని గుర్తించదే ఈ లోకం
డబ్బు అనే స్వార్థాన్ని గుర్తిస్తే
మనీ అనే మాయను గమనిస్తే
ధనం అనే దృష్టిని దహించేస్తే
పైస అనే ప్రీతిని పుష్టము చేస్తే
జాలి, దయ, కరుణతో ప్రాణం పోయవచ్చు!
ప్రేమ మమత సమతతో బాంధవ్యం పెంచవచ్చు!
అనురాగం ఆప్యాయతలతో!
ఐకమత్యం సాధించవచ్చు!
సంకుచితం, స్వార్థం వీడితే!
సిరి లేకనే ఏదైనా సాధించవచ్చు!

# వేసవి గదిలో మధ్యాహ్నం



జి.పి. రాంచంద్, కర్నూలు.
98495 31202

మంచమెక్కిన నిద్ర
ఫ్యాన్‌కు ఉరేసుకుంటుంది.
ధైర్యం చాలని దోమ
ఆ ప్రక్కనే తచ్చాడుతూవుంటుంది.
ఆలోచన మెదడులోకి
రాళ్ళు విసురుతుంటుంది
శబ్దం నిశ్శబ్దాన్ని గిల్లుతూ వుంటుంది
గదిబైట మధ్యాహ్నం –
మిటకరించి చూస్తుంది
అదినన్నో దాన్ని నేనో భయపెట్టుకుంటూ.
తమస్సులో తచ్చాడుతుంటాను
అంతలో –
సౌఖ్యం తెరచాప తిరగబడుతుంది
పచార్లు ఆపి ఫ్యాన్
పసి పాపలా నిద్రపోతుంది.
శబ్దం నోర్మూసుకుంటుంది
దోమ ఏనుగవుతుంది.
మధ్యాహ్నం మంచమెక్కి కూర్చుంటుంది
శరీరం నీటి చెలిమై కరుగుతుంది.
తమస్సు తిడుతూ
ఉషస్సును లేపుతుంది.
దున్నపోతును కానందుకు
కొమ్ములు పీక్కుంటూ లేస్తాను.

# పేవ్‌మెంట్!



వెల్దండి శ్రీధర్, కర్నూలు.
98669 77741

అక్కడికి చేరగానే

పదుల చేతులు

ఆకలిని చేతుల్లోకి తీసుకొని

నీరసంగా అడుక్కుంటుంటాయి

రాని పాల కోసం

ఎండిన రొమ్ముల్ని పీలుస్తూ పసివాడు!

అదే దృశ్యాన్ని కామంతో చూసే

మదపు చూపులు!

జీవితమంతా కుటుంబం కోసమే

ధారపోసిన ముడుతలు పడ్డ అవ్వ శరీరం!

బుక్కెడు మెతుకుల కోసం

ప్రతి మనిషి ముందు అంగుళం కదలలేని అంగ వైకల్యం!

ఏ చోటుకైనా రివ్వున పరిగెత్తే అనాథ బాల్యం!

లోకాన్ని చూడలేని అంధత్వం!

పైసా దానం చేసినా

చేయి చాపలేని కుష్టుత్వం!

అన్నీ బండ బారిన మనిషికి అంకుశ ప్రాయపు సవాళ్ళు

ఈ దేశపు దేహానికి మానని గాయాలు

బతుకుపోరును ఆలపించే నిరంతర గేయాలు!

# కరెన్సీ కత్తెర



**జెండామాన్ ఇస్మాయిల్,**
**పత్తికొండ.94900 12802**

మా ఊరు కట్టుకున్న
పచ్చని చీరని
కరెన్సీ కత్తెర ఉత్తరించింది.
అదెక్కడా కనిపించలేదు
దాని సడి వినిపించలేదు
కరెన్సీ ఫెళఫెళలు తప్ప!
పల్లెకు పచ్చల చీర చుట్టి
నిన్నటి దాకా మురిసిన నేలతల్లి
నేడు నేల బారుగా పడుంది.
కోళ్ళు విరిగి కూలిన మంచంలా
పాడెకెదురు చూస్తున్న
జీవచ్ఛవంలా
ఒంటినిండా కరెన్సీ దిగ్గొట్టిన
రంగురాళ్ళ క్రింద
ముక్కలుగా చీల్చిన
నిలువు అడ్డ దారుల మధ్య
సస్యసిరులు పిండుకున్న చేతుల్లో
కరెన్సీ కత్తెర రక్కిన
రంగుల జెండాల నడుమ

# మా సీమ....



**బావికాటి రాఘవేంద్ర,**
**కోవెలకుంట్ల**
**97042 04681**

నాకు కలొచ్చింది
'పునర్వసు'లో చినుకుపడి మా సీమ
సింగారించుకున్న కుందనపుబొమ్మలా ఉంది.
'ఉత్తర'లో మా శెనగ చేను
గౌరమ్మ పండుగనాడు
పూల జడేసుకున్నట్లుగా ఉంది
'మఖ'లో మా శెనగ చెట్టు
విరగ్గాసిన కాయలు
అమెరికా డాలర్లలా గలగలమంటున్నాయి.
'మాఘం'లో మా కల్లం
ఆవు పొదుగులా
అమృతభాండంలా అందంగా ఉంది.
నాకు మెలకువొచ్చింది
ప్చ్....ఒక్క చినుకులేదు
ఒక్క మొలక లేదు
ఎటు చూసినా... మా సీమ
ముడతలుపడ్డ ముసలమ్మలా
చింపిరి జుట్టుతో పిచ్చిదానిలా
విలవిలలాడే అభాగినిలా
కర్మకాండలో వెలిగే దీపకలశంలా
దీనంగా, శోకంగా ఉంది.
అందుకే మా సీమన్నా
మా చేలన్నా నాకు చేదెక్కిపోతుంది.
తీపిగా రమ్మంటోంది
మాయలమారి పొగపట్నం!
పుడమికొడుకు పొలోమని...
వలసెల్లిపోతుంటే
మూగగ రోదిస్తోంది పంటపల్లె.

# కారు చౌక ఉద్యోగిని



కె. విజయ ప్రసాద్
కర్నూలు.
సెల్: 77948 20104

కూలీగా వెళ్ళలేను పొలం పనులకు
చిన్న చితక పనులు చేయలేను మేస్త్రీగా
చిరుచిరు వ్యాపారాలు నేర్చుకోలేను
మహా బాగా చదువుకున్న పాపానికి!
డిపార్టుమెంటల్ స్టోర్లల్లో నిలువునా
సేల్సుగరల్సుగా మగ్గిపోవాలి రాత్రిదాకా!
కాన్వెంటు స్కూళ్ళల్లో వేళాపాళాలేని
టీచర్లుగా రాటుదేలి రాలిపోవాలి!
బాసు ఎలాంటివాడైనా కూడ
వాడి చూపులలో వయనంగా పయనించాలి!
ఇందిరాగాంధీ సాక్షిగా ఏవీ ఎక్కడ?
వెట్టిచాకిరీ నిషేధపు చట్టాలు?
కార్మిక పనిగంటలు నియంత్రించే
కార్మిక లేబరు ఆఫీసరు దొరలకు
వెట్టి ఈ స్కూలు టీచర్లు కనపడరా?
వారి గట్టి తీరనివెతలు వినపడవా?
పెక్కు ఈ చిన్ని చితక ఉద్యోగుల ఘోర
నికృష్ట కలియుగ కష్టాలు అగుపడవా?
రోజుకు పన్నెండు గంటలు వెట్టి చేసినా
అహరహం పండుగలలో శ్రమించినా
జానెడు కడుపు ఆకలి తీరనే తీరదు
ఇంటికి ఆత్మీయులొస్తే మోయలేని బరువు
జబ్బుచేస్తే వెక్కిరిస్తుంది ఖాళీజేబు
మరి నేను చీపెస్టు ఎడ్యుకేటెడ్ లేబర్ని కదా!

# పరుగుల జీవితంలో



గుండపాటి విజయసారథి,
కర్నూలు. 91772 38069

పచ్చని చెట్లను నరికి
అడవిని ఎడారిగా మార్చినట్లు
పచ్చటి నోట్లను వెతుక్కుంటూ
వెచ్చటి ఆత్మీయతలను కాల్చేశాం

చెరువులూ, బావులూ
నదులూ, ఏర్లూ
ఎండాకాలం ఎండినట్లు
అనుబంధాలూ, చిరునవ్వులూ
పలకరింపులూ, పులకరింతలూ
అన్ని కాలాల్లో ఆవిరై పోయాయి

ఏ అల్పపీడనమో
నాలుగు చినుకులు రాల్చినట్లు
ఏ వివాహ వేడుకలోనో
నలుగురం కలుస్తాం కాసేపు

ఎక్కడికీ ఉరుకులు పరుగులు!
గ్రుక్కెడు నీళ్ళు కొనుక్కుంటూ
పక్కపై ముళ్ళు పరుచుకుంటూ
ప్రక్కవాడిని క్రిందికి తోసేస్తూ....

# తొలకరి ఉరకలు



**పట్నాయకుని**
**వేంకటేశ్వరరావు,**
**కర్నూలు. 9705347880**

తొలకరి రాలితే... కొత్త పులకింత
రైతు లోగిళ్ళలో ఏటా ఆనందాల కేరింత
సూర్యునితో పోటీ – చంద్రునితో భేటీ
అరకలు ఉరకలు... మెరకల్లో నాగలి రేఖలు
బంగారు పంటలపై ఆశలతో గీసే గీతలు
అప్పుల కోసం చెప్పులరిగేలా తిప్పలు
బ్యాంకులు, సహకారుల చుట్టూ గిరికీలు
విత్తు మొదలు శ్రమ... ఆరుగాలం భ్రమ
అంగట్లో 'నకిలీల' బెడద
ముంగిట్లో 'పథకాల' రొద
పిల్లాడి మొదలు... కళ్ళల్లో...
వత్తులేసుకొని గడిపేరోజులు
ఆఖరికి పత్తి నవ్వదు... వడ్లు దుడ్లు రాల్చవు
'కూరలూ' చిల్లిగవ్వనివ్వవు
చెనిక్కాయ కునుకు తీస్తుంది
చివరికి మార్కెట్టూ దగా చేస్తుంది
ఐనా వెరవని 'సీమ' వ్యవసాయీ...
నిత్య శ్రమ సాయీ...
ఖరీఫ్, రబీల జాతకాలు
తెలిసిన సిద్ధాంతి
జీవన సారమెరిగిన వేదాంతి
సీజనేదైనా నాదీ ఓ రోజుందని చెప్పే
కర్షకయోధుడు... హర్షిత ధీరుడు
చైతన్యమూర్తీ.... నిరంతర స్ఫూర్తీ...!!

# మానవుడా!



డా॥ కె. సంజన్న, ఆదోని
98855 12658

శాస్త్ర సాంకేతిక విజ్ఞానంలో
విహరిస్తున్నానని విర్రవీగుతున్న మానవుడా...
అజ్ఞానాంధకారంలో సంచరిస్తూ
అహంకారమనే ఊయలలూగుతూ
రంగుల చిత్రాలకు మనసప్పగించి
హింసాదృశ్యాలను, నగ్న నాట్యాలను తిలకిస్తూ
పులకించిపోవుటేనా ఆధునిక విజ్ఞానం
కన్నుమిన్ను గానక కాలాన్ని కాళ్ళతో తన్నుతూ
కలికాల వైపరీత్యాలను నిజం చేస్తూ
నీతి, న్యాయం, ధర్మం ఆచరణలలో
నిమ్మకు నీరెత్తినట్లు నిర్లక్ష్యం వహిస్తున్నావు.
సాహిత్యాన్ని, సామాజిక చింతననూ, చైతన్యాన్నీ
పెంపొందించకుంటే, ఆస్వాదించకుంటే
జీవితం వ్యర్థమని తెలుసుకో!
అందుకే... జీవితానికి, ప్రేమ పరిమళాలు
అద్దమంటాను, మానవత్వాన్ని పెంచమంటాను.

# జాడలేని నీడలు



**టి. వెంకటేష్, కర్నూలు.**
**99853 25362**

శిలాజపు గుండెను తొలచి
గూడుగా మలచిన పురామేధ
పర్వత పాయల్లో గుహగ పూచిన
కళా రూపం కథ
అజంతా వెలుగైన తొలిఅడుగు వ్యథ
కాంతి భూమికి చేరి పగలైనట్టు
అత్తరు సీసాలోకి దూరి పరిమళమైనట్టు
ఓచోట శ్రమశక్తి కేతనమై రెపరెపలాడుతుంది
అనేక రూపాల శక్తిచలనం అనేక ఆకృతుల్లో
మూడు ఋతువుల కాపలా అవుతుంది
పేర్లు ఎలా ఉన్నా
సంఘటిత బలం మహానిర్మాణమవుతుంది.
బహుముఖాల పనిముట్లు
శ్రమచేతుల్లో ఒదిగి ఏడువింతలై
బహుజన సంస్కృతికి చిరునామా అవుతాయి
ఎన్నో దేహాలు మరెన్నో ప్రాణాలు సమిధలై
చీకటి వేళల్లో కన్పించని గాయాలై
తాజ్ చలువలో కోణార్క్ నీడలో
వికసించని వెలుగు రేఖలై
వెచ్చటి గూటికి పచ్చటి రంగై
కోటలై పేటలై తమది కాని స్వప్న సాకారానికి ఆకారాలై
గండు శిలలను ప్రేమించే నునుయవ్వనాలై
ఆవాసాల కూర్పులో
శిలాఫలకాలపై మెరవని అనామక పాత్రలై
కట్టడాల చరిత కింద విస్తరించని పచ్చిక బయళ్ళై
కాంక్రీట్ అరణ్యాల గుండా
ఆరు కారులు ప్రవహిస్తోన్న
స్వేద నదాలు వాళ్ళు

# బ్యూటీ పార్లర్



జంధ్యాల రఘుబాబు
కర్నూలు
98497 53298

స్వాగతం సుస్వాగతం మా బ్యూటీ పార్లర్‌కి
అందానికి అందం, ఉచితంగా ఆనందం
ఇదే మా 'వంద'నం అంతా నందనవనం
లింగ వయో భేదాలు లేవిక్కడ
ప్రతిఒక్కరిని మారుస్తాం అందంగా తయారుచేస్తాం
శారీరకంగా అనుకునేరు, మానసికంగా సుమీ
ఇక్కడ మీ మనస్సును సౌందర్యవంతంగా
మీ మస్తిష్కాన్ని సొగసుగా, మీ ఊహల్ని అలంకారప్రాయంగా
మీ ఆలోచనల్ని అద్భుతంగా
చేయ ప్రయత్నిస్తాం
మీ కనురెప్పలతో, మీ కనుబొమలతో
మాకేమీ పనిలేదు, మీ కనుపాపలే మా సాధనం
ఈ ప్రపంచాన్ని ఇంకా అందంగా
ఎలా చూడాలో నేర్పుతాం వాటికి
కష్టజీవి స్వేదంలోని శోభని
తిష్టజీవి నుదుటి చెమటలోని
మాలిన్యాన్ని గుర్తించేలా మిమ్మల్ని
తీర్చిదిద్దుతాం, మీ నయనాల ద్వారా
మా దగ్గర ఎన్నో రిమూవర్లున్నాయ్
వాటితో వ్యవస్థపై అపోహల్ని అత్యాశల్ని తొలగించి
నిజాలని, సత్యాలని మీ మెదడులో ఇంప్లాంట్ చేస్తాం
మరో ప్రపంచం చూపుతాం
దాని బాటను మీకు పరిచయం చేస్తాం
రండి అందరికీ అందే పృథ్వికి స్వాగతం!
మా బ్యూటీపార్లర్‌కి సుస్వాగతం.

# మానవత్వం మరచిన మనిషి



**కొత్తపల్లి సత్యనారాయణ,**
**పత్తికొండ. 94410 57804**

భక్తి ముసుగు తొడిగెనా - మానవుడు
మానవత్వం మరచెనా
నిజాయితీనంత నిప్పుల్లో వేసి
నీతీ నియమాలకు నీళ్ళు వదిలేసి
ప్రేమానుబంధాలు గాలికొదిలేసి
భక్తుని వేషం వేసి ఫోజుబెడుతున్నాడు
సందె పొద్దున లేచి - స్నానంబు జేస్తాడు
బత్తీలు వెలిగించి - బొట్టును బెడతాడు
నారికేళం గొట్టి - హారతిస్తాడు
గంటబాగా గొట్టి - దండమిడుతాడు
అసలైన భక్తుడిలా - ఆఫీసుకొస్తాడు
వాస్తు దిశలోనే - ఆసీనుడవుతాడు
లంచమియ్యనిదే - అంచుకు రానీడు
బీద సాదలనడు - ముసలిముతకలనడు
రాకాసిలా రాచి రంపాన బెడతాడు
పుణ్యక్షేత్రాలు దర్శిస్తూ - పొర్లు దండాలిడుతాడు
బైబులు వాక్యమ్ము - బోధిస్తువున్నాడు.
ఖురాను చదువుతూ - సూరాలు జెపుతాడు
దీక్షస్వాములకు - భక్షాల బిక్షెడతాడు
ఇస్లాం భక్తులకు - ఇఫ్తారు విందెడతాడు
గుడిగోపురాలకు - గుప్తదానమ్ములిస్తాడు
మాతృదేవతకు - మంచి నీళ్ళివ్వడు
పితృదేవునకు - పిడికెడన్నము పెట్టడు
ముద్ద బువ్వడిగితే - ముష్టెత్తమంటాడు.

# కవన సేద్యం



కెంగార మోహన్, ఆదోని.
94933 75447

హృదయం వర్షించునప్పుడల్లా,
అక్షరాల విత్తులు విత్తుతాను.
కరాన్ని అనంత విశ్వంలో,
కలియదిప్పి చదును చేస్తాను.
స్వేదంతో తడిపేస్తాను.
సేద్యం చేసేందుకు ఉత్సాహం
రెట్టింపవుతూనే ఉంటుంది.
ప్రపంచాన్నే పలుగు పారలుగా
చేసుకున్నాను.
కాలంతో, ఋతువులతో
పనిలేని వ్యవసాయం చేస్తాను.
అత్యాచారాలు, ఆర్తనాదాలు, హత్యలు,
అంతరించిన మానవ సంబంధాలు
చారికల్లో మొలకెత్తి ప్రశ్నిస్తుంటాయి.
ఉరేసుకున్న కృషీవరులంతా,
పంటలో పుష్పాలై వికసిస్తారు.
పైరు పెరగాలంటే కన్నీటితో తడిపేస్తాను.
విలువల పిచికారి
ఎప్పటికప్పుడు చేస్తూనే ఉంటాను.
అలుపెరగని కర్షకుణ్ణి నేను.
సామాజిక చైతన్య కవనసేద్యం నాది

# మానవతా మూర్తులందరికీ ఆహ్వానం



**టి. సురేష్‌బాబు,**
**డోన్.**
**9490210765**

మానవతా అస్తిత్వం ప్రశ్నార్థక మవుతోంది!
దానవతా జృంభణతో ధరణి వణికి పోతోంది!
కామంతో కళ్ళు కప్పి మదాంధుల
అత్యాచారాలు, హత్యాచారాలు ఆచారాలై
కులమత విద్వేషాలు, ప్రాంతీయ వైషమ్యాలు,
భాషా వైరుధ్యాలు, భేషజాలు, యిజాలు
ఆరని దారుణ మారణ హోమం సృష్టిస్తుంటే
సహనం, సౌశీల్యత చేతకానితనాలుగా
అన్యాయం, అక్రమం, అధర్మం, దౌర్జన్యాలే శౌర్యంగా గౌరవింపబడితే
మహాత్ముల అడుగు జాడలు చెరిగిపోతుంటే...
కుట్రలు, కుతంత్రాలు, కక్షలు, కార్పణ్యాలు రక్తంలో కలిసిపోయి
నరనరాల వ్యాపించి నరభావన వానరభావనగా మారితే..
'సత్యంవద' – సత్యం 'వధ'గా
'ధర్మంచర' – ధర్మం 'చెర'గా అపభ్రంశం చెందితే
అయినవారికి ఆకుల్లో కానివారికి కంచాల చందాన
స్వధర్మం... పరధర్మం ఆదరింపబడితే.
స్వేచ్ఛ, సమానత్వం, స్వాతంత్ర్యం, సామ్యవాదం... పలకడానికి మాత్రమే పరిమితమై
ఆచరణలో అసాధ్యమై అదృశ్యమై పోతుంటే...
నైతికత అనైతికంగా గోతిలో కప్పివేయబడితే...
శ్రమైక జీవన సౌందర్యం అస్పృశ్యతకు లోనై.
పరాక్రమ జీవ సౌందర్యం లిప్స్టిక్కులతో అలరిస్తుంటే.
నిర్వేదం, నిస్సహాయత ఆవరించిన తరుణంలో
దారి తప్పిన సమాజ గమనాన్ని సరిదిద్ది
గుండెల నిండా ఆశలు నింపి జీవన స్థైర్యాన్ని పెంపొందించే
మానవతా మూర్తులందరికీ...
మానవలోకాన్ని నవజీవనధామంలా తీర్చి దిద్దేందుకు... ఆహ్వానం

# బాలగేయం (బాల కార్మికులు)



డా॥ కురుమేటి కిషోర్
కుమార్, నంద్యాల.
94402 44340

చింపిరి జుట్టు, చీమిడి ముక్కు
చిరిగిన చొక్కా, నలిగిన నిక్కరు
మసిబారిన దేహం, మెరిసే కళ్ళు
పసితనంలో తలకుమించిన భారం
యజమాని తిట్లు, దెబ్బలతో
మనసున నాటిన మానని గాయం
వేదనతో రోదించి, ఇంకిన కన్నీరు
విసిగి, వేసారి బ్రతుకు వెళ్ళబుచ్చుతున్న
బాలలం, చిన్నారులం...

పిట్టలా రివ్వున ఎగరాలని, చేపపిల్లలా ఈదాలని
లేడిపిల్లలా చెంగున దూకాలని, హరివిల్లునెక్కి ఊగాలని
వానా! వానా! వల్లప్పంటు... చిరుజల్లులో తడవాలనుంది
ఆడాలనుంది పాడాలనుంది
చదవాలనుంది పైకెదగాలనుంది
అవకాశమిస్తే అవుతాము మేము
టాటా! బిర్లా! టెండూల్కర్లూ!
కలాం లా చేయూత నివ్వండి! తడాఖా చూపిస్తాము
పిల్లలం కాదు... చిచ్చర పిడుగులం
గనుల్లో, పొలాల్లో, ఇళ్ళల్లో, హోటళ్ళలో
కూలీలుగా పశువుల కాపర్లుగా,
విలువైన మా బాల్యం... కరిగిపోతుంది కర్పూరంలా
పసివాడని మా చిరుప్రాయం... తిరిగిరానిది
మొగ్గలోనే తుంచివేయకండి... ఆలోచించండి
చిన్ని, బుజ్జి, బన్ని,పండూ, నానీలు కాదు మేము
భావిభారత పౌరులం – భరతమాత బిడ్డలం
భగత్సింగు వారసులం

# విహంగ స్ఫూర్తి



బి. రాణి లీలావతి,
కర్నూలు.
99897 33736

వినీలాకాశంలో విహరించే
విహంగానికి కాదది వినోదం
భుక్తి కొరకే ఆరాటం
ఆకలి దప్పులతో పోరాటం
నిరంతరం జరిగే సంగ్రామం
ప్రాణాలతోనే చెలగాటం
అది తెలిసికూడా ఆగదు దాని ఆర్తి
మనకు మల్లె ఆశపడదది జాస్తి
దాచుకునేదేముంటుంది? నాస్తి...
నిరాసక్త జీవన స్రవంతిలో
వృథాగా గడిచే రోజులెన్నో?
మనసు చేదై కాలం బరువై
జవాబు దొరకని ప్రశ్నలెన్నో
తుదిలేని ఆలోచనలతో
ఎద చెఱువైన వేళ...
దాని ఆర్తి చూసి స్ఫూర్తి పొందా!
చీకటి కమ్ముకున్న జీవితాన
విశ్వాసపు చమురుతో
ఆశల ప్రమిదలు వెలిగించా...
గమ్యం తెలియని బ్రతుక్కొక
లక్ష్యం గుర్తించా...
"విశ్రమించని పరిశ్రమ" యెద మంటై మండగా
ముందుకురికా నిండుగా
లక్ష్యం వైపు కదులుతున్న ఈ నా ఆర్తి
మరెందరికో కావాలి స్ఫూర్తి!"

# నా పల్లె



**జి. శ్రీనివాసులు, ఆళ్ళగడ్డ.**
**98859 84421**

కానరాదేమి నా పల్లె

మారుతున్న మనసుల మాటున,

చిన్నతనమున నేను ఊయలూగిన

ఊడలమర్రి అగుపించదే మరి!

చెట్లచాటున నేను కాగితం పడవలు

వదలిన పిల్ల కాలువ కనిపించదే మరి!

నేను కూర్చుండిన నా పల్లె మెట్ట

మట్టి మాటున మాయమాయెనే మరి!

ఘల్లు, ఘల్లు మనే గజ్జలతో మా ఎడ్లబండ్లు

నడచిన బాట కానరాదే మరి!

పెరుగుతున్న అభివృద్ధి మాటున

తరుగుతున్నదీ ప్రకృతి సంపద.

పచ్చని చెట్లు లేని రహదారులు

పెడదారి పడుతున్నాయేమో మరి!

ప్రకృతి సంపదను పాడు చేస్తూ పోవడమేనా

అభివృద్ధి! అదేనా ప్రగతి! ప్చ్.

# మనస్సాక్షి



పి. హరనాథ్, నంద్యాల.
98490 64978

**నా కవిత్వం**

పద పొందికల అల్లికలు కాదు
ఆకలి ప్రేగుల పదనిసల ప్రజ్వలనం
భావ పరంపరల చరితలు కాదు
గుండె కోతల భగభగల సంజ్వలనం
స్వార్థపూరిత కాంక్షలు కాదు
స్వేచ్ఛాసుమాల ఘుమఘుమల పరిమళం
పగ ద్వేషాల పిడికిళ్ళు కాదు
ప్రేమఫలాల మధురిమల మానవత్వం
నేర సంకెళ్ళ కౌగిళ్ళు కాదు
న్యాయ చట్టాల మెలకువల మహోన్నతం

**నా కవిత్వం**

స్నేహ కాంతులతో
ప్రగతిపథ గమనంతో
సమాజ జాగృతికి
సమసమాజ ఆకృతికి
జనహృదయాలవారధియై
శ్రమచేతనా సారథియై
సార్వజనీన సత్యాన్వేషియై
చరిత్రపుటల్లో సజీవ సాక్షియై
పరిమళించాలి.
పరితపించాలి.

# మనిషీ నీ చిరునామా ఏదీ?



మధుర కవి ఎలమర్తి
రమణయ్య, కర్నూలు
94901 31005

పూవు గొంతుక తెగిపోతే కదిలిపోయే నీవు
కన్నీళ్ళకు రాళ్ళైనా కరిగిపోతాయని నమ్మే నీవు
సహవాసి ఎడబాటు సహింపలేక
దేవుని గుడిలోనే మన్నుబోసేనీవు
మానవత్వం ఉన్న మనిషి! నీవు
ఎక్కడున్నావూ? ఏమైనావు?
మానవ కళ్యాణం కోరే మతం వెర్రితలలు వేస్తుంటే
అమాయకులైన ప్రజల తలలు తెగి నేలకు పడుతుంటే
ఎందుకీ మారణహోమమని అడుగను రాక
ముందుకొచ్చీ మనసులోని మాట చెప్పనూ లేక
ఎక్కడ దాగున్నావు? ఏమి చేస్తున్నావు?
పశువులా బ్రతికినా
పాతరాతి యుగంలోనే నయం
జంతువుల్ని వేటాడావే తప్ప
నీతోటి మానవుని జంతువులా చూడనేలేదు
జనారణ్యంలో నవనాగరీకుడవైన నీవు
గోముఖ వ్యాఘ్రానివే అయ్యావు
మంత పుట్టుకకుముందే ఉన్న మనిషీ
మతాన్ని పుట్టించిన ఓ మనిషీ
మతం ముందు నీవే మరుగుజ్జువయ్యావు.
ఆ మతం చేతిలో మరబొమ్మవే అయ్యావు
జనహితం మరచి నరపశువై పోవద్దనీ
జనహితం తలిచి అసలు సిసలు మనిషివి కావాలనీ
మనసారా ఆకాంక్షిస్తున్నా
నీ విలాసం కోసం అన్వేషిస్తున్నా..

# కర్షకా...



**యం. శ్రీధర్‌మూర్తి యాదవ్,**
**కర్నూలు. 94913 42790**

కారు చీకటికి... పాము కాటుకు
వెరవని... సాహసికా!
ఆకలికి కేక లేసేవా కన్నీటికి దారి తీసేవా
నిద్దురను పాతరబెట్టి
తొలి పొద్దున సద్దిని గట్టి
చలి చెలిని రుమాల జుట్టి
తొలి అడుగు గట్టునబెట్టి
కాడెద్దుల పగ్గంబట్టి
ఒడలు వంచి తల్లి నేలను
తన్మయత్వం చేసితివా!
జగమెరుగని కష్టం జగతి మేల్కొనగాజేసి
జారు పొద్దు కాడ జావ గంజి తాగి
గువ్వలా ఒదిగితివా!
నల్లిలా... నలిగితివా!
సుప్పనాతి ప్రళయం సునామియైన... వేళ
నిదురించలేని మనసు
సుడిగుండమాయె!
గుండె అదిరిన గూడు చెదిరిన
నరక యాతనగా సాగిన
చూడలేని జనానికి... చుట్టానివి
కానరాని యుగానికి... దిక్సూచివి
అవధుల అంచున ఉన్న
నీ శ్రమయే... మా బలం
నీ దాతృత్వమే మా జీవనం... జీవితం!

# ప్రయత్నం



చిన్న నాగేష్, కోడుమూరు.
98857 16943

ప్రతిబింబం వెక్కిరించి
పకపకా నవ్వుతుంది
సత్తువ లేని యువత యావత్తుని
చూసి....
చేతకాని యువత మొత్తం
రంగుల డోలనం చేస్తుంది,
రాలిపడిన నక్షత్రాలను
వెతుక్కుంటూ వెళ్తుంది...
కరెంటు స్తంభం వంగుతుంది
తీగలకు వేలాడిన శవాల
బరువు మోయలేక,
గాలిపటం తీరుగా
వేలాడిన శవాల వరుస
గాలిలోని ప్రేతాత్మ ప్రేలాపిస్తూ తిరుగుతుంది...
స్మశానంలోని దూమమంతా
దెయ్యం రూపు దాల్చనుంది
ఇంత చూస్తూ....
యువత మాత్రం వరుస దాటేస్తూనే ఉన్నారు,
ప్రయత్నమంటూ మొదలు పెడితే
ఎడారిలోని ఇసుక రేణువుల్ని లెక్కించమంటా...
సాగరంలోని నీటినంతా పుక్కిటితో తోడేయ్యమంటా...
శవాల గొంతులోని తాడు తీసి
పేడ్చి విశ్వమంతటిని మూట కట్టమంటా
కానీ....
ప్రతిబింబం నవ్వు ఆపదూ...
యువతకు చేవ చావదు...
పదండి ప్రయత్నిద్దాం
ఫలిస్తే ఆనందిద్దాం.

# అక్షరాల కోసం



**పర్ల చంద్రశేఖర్, కర్నూలు.**
**9440710153**

అక్షరాల కోసం పెదవులను బిగించాను

అక్షరాల కోసం నరాలను వీణగా వాయించాను

అక్షరాల కోసం ఆలోచనలను మండించాను

అక్షరాల కోసం కలాన్ని కరవాలంగా ఝుళిపించాను

అక్షరాల కోసం అరుణకిరణమవుతాను

అక్షరాల కోసం యజ్ఞం చేస్తాను

అక్షరాల కోసం సంఘర్షణ పడతాను

అక్షరాల కోసం ప్రసవ వేదన భరిస్తాను

అక్షరాలతో వెలుగులు పూయిస్తాను

అక్షరాలతో బిగించిన పిడికిలై ఉద్యమిస్తాను

అక్షరాలను పేర్చి పేర్చి లోకానికి వేగుచుక్కనవుతాను

# యువత భవిత



**ఎల్.ఎన్. నీలకంఠమాచారి,**
**నంద్యాల. 98850 69427**

ఎటుపోతుంది యువతరం ఈ దినం
సినీ మాయ జగత్తులో విహరిస్తూ
ఆత్రంగా ఆరాటంగా అర్రులు చాస్తూ
పాశ్చాత్యపు పోకడలను నెత్తికెత్తుకొని
విచ్చలవిడి స్వేచ్ఛతో పరిగెడుతోంది
అంతర్జాలాల జంతర్ మంతర్‌లు
ఫేస్‌బుక్, ట్విట్టర్ల మాయాజాలాలు
మతులు చెడగొడుతున్నవేళ
సత్సంబంధాలు తరిగి
విలువలు మంచులా కరిగి
విశృంఖలతకు దారులేర్పడి
ఉన్మాదంతో ఉద్రేకంతో
పరుగుతీసే ఓ యువతా!
కాస్త ఆగి ఆలోచించు
వాస్తవాలు తెలుసుకొని
సామాజిక స్పృహను పెంచుకొని
సాగించు నీ పయనం
అపుడే నీ భవిత ఉజ్వలం
దేశానికి ప్రయోజనం
నీ జన్మకు సార్థకం.

# మా పల్లెటూరు



**యం. విజయకుమార్,**
**దేవనకొండ.**
**94406 24201**

అందమైన మా పల్లెటూరు

ఆత్మీయతకు నెలవైన ఊరు

కోడి కూతల మేలుకొలుపు

సూర్యకిరణాల పలకరింపు

అన్నదమ్ముల అనుబంధాలు

అక్కాచెల్లెళ్ళ అనురాగాలు

ఉమ్మడి కుటుంబాల అభిమానాలు

పల్లెపాటలకు పుట్టినిల్లు మా పల్లెటూరు

హస్తకళలకు పెట్టినిల్లు మా పల్లెటూరు

ముంగిట ముగ్గులే మా పల్లెకు స్వాగత తోరణాలు

పచ్చని పైరులే మా పల్లెటూరు

కోయిల పాటలే మా పల్లె సంగీతాలు

పిల్ల కాలువలే మా పల్లెకు వడ్డాణాలు

అడవి పువ్వులే మా పల్లెకు పరిమళాలు

పచ్చని చెట్లే మా పల్లెకు పందిరులు

నేడు ఏవీ

ఆ సంబరాలూ, సంతోషాలూ...

# మనసుకు రంగు

నన్ను కన్నవాళ్ళకు
నేను కన్నవాళ్ళకు
మధ్య సంధానం చేయలేని
సంక్లిష్ట జీవితంలో...
కాలం చేసిన విస్ఫోటనానికి
కనుమరుగవుతున్న బంధాలను
కరెన్సీ కాగితాలతో
కలిపేద్దామనుకున్నా...
కుదరక
జుట్టుకు రంగేసుకున్నట్టు
మనసుకు
రంగేసుకొని బ్రతికేస్తున్నా...



**కళ్యాణదుర్గం స్వర్ణలత,**
**కర్నూలు. 98486 26114**

# అందం

కళ్ళకు కాటుక కాదు
అందం
అందరినీ సమంగా
చూసుకోవడమే!
చేతికి గాజులు కాదు
అందం
ఆపద గల వారిని
ఆదుకోవడమే!
వేలికి ఉంగరం కాదు
అందం
అక్షరాలు ఆయుధాలుగా మలచడమే!
కాలికి పట్టీకాదు
అందం
అభ్యుదయం వైపు అడుగులు వేయడమే!



**ఎం. నాగజ్యోతి, ఆదోని.**
**88868 65372**

# నాడు - నేడు




ఎస్.డి.వి అజీజ్
కర్నూలు
81063 67175


నాడూ బానిసత్వం
నేడూ బానిసత్వం
నాడు నల్లమందు మాంసపుముద్దలు
తిరుగుబాటుకు తావు లేకుండా మత్తు
నేడూ అంతే! స్వేచ్ఛమాటున ఎన్నో అరాచకాలు
నాడు బహిరంగంగా బానిసల విక్రయాలు
నేడు 'స్వేచ్ఛ' అన్న పరదా మాటున విక్రయాలు...
నాడు బానిసల కూర్పు, నేడు బానిసల తయారీ
నాటి బానిసల మధ్య మనిషి కోసం బాధ అయినా వుండేది
నేడు బానిసల మధ్య - బాధలేదు. అనుబంధంలేదు.
అవసరం అయితే - సిటిబానిసలే దోచే పరిస్థితి
నాడు మాంసపు ముద్దలు, నేడు కాగితాల కట్టలు
నాడు బానిసత్వం తెంపాలన్న ఆరాటం అయినా వుండేది.
నేడు ఆరాటం లేదు. పోరాటం లేదు
ఇక వారు కల్పించిన భ్రమల్లో జీవించకుండా
వృత్తి జీతగాడు, శ్రమజీవి ఒక్కో స్పార్టకస్ కావాలి.
స్వేచ్ఛ మాటున వేసి వున్న ముసుగు తొలగించాలి
వారి అంతర్గత స్వరూపం బట్టబయలు చేయాలి.
లేదంటే... నాటి సంకెళ్ళకు బదులు,
'ఉపాధి' తాడును కట్టి ఆడిస్తోన్న వారి ఆటలకు
నాగరికత వేషం వేసి ఆడించిన కోతిలా ఆడక తప్పదు
నింగికంటిన వారి వేడుకలను చూస్తూ
నిరాశ నిట్టూర్పులతోనే గమనం సాగించక తప్పదు.
జీవనం అంటే దాస్యం అన్న అర్థం పునరావృతం
చేస్తూ వుండక తప్పదు.

# మనుగడ కోసం



**అంకి శ్రీనివాస్,**
**ఆదోని**
**99494 86653**

నాలుగు గోడల మధ్య
నాలుగు రోడ్ల మధ్య
ప్రాణవాయువు లభించక
మనిషి విలవిలలాడిపోతున్నాడు.
తన స్వార్థం కోసం అటవీ సంపదను
కొల్లగొట్టి, ఉపద్రవాన్ని కొనితెచ్చుకుంటున్నాడు
అభివృద్ధిపేరుతో
పొగలుజిమ్మే పరిశ్రమలూ
ఆకాశ హర్మ్యాలూ
అనవసర హంగుల కోసం, ప్రకృతి ధ్వంసమవుతున్న దీన దృశ్యం
జరుగుతున్నది పారిశ్రామికీకరణమా!
ప్రపంచ పెత్తనమా?
అభివృద్ధి మాటున దాగిన అనర్థమా?
ఏలే వారికి ప్రకృతిమీదా, పర్యావరణం మీదా
ప్రేమ ప్రశ్నార్థకం!
మనజోన్ నుండి ఓజోన్ వరకూ
పాయిజన్ సరఫరా విస్తృతమైనా
పాలకులకు మాత్రం పచ్చదనంపై కసితీరలేదు
ఇక ఆరోగ్య భారతం కలేనేమో!
పచ్చనోట్లనే గొడ్డళ్ళతో చెట్లకు గాట్లు వేస్తున్నారు.

# మంచి బహుమతి



**సయ్యద్ జహీర్ అహ్మద్,**
**కర్నూలు. 95051 52560**

ట్రైటిల్ ఎవడో చక్కగా పెట్టాడు దోబూచి దొరబాబు
రెక్కలు విప్పిన రాబందు అచ్చెరువవుతుంది
రంగులు మార్చే ఊసరవెల్లి విస్తుపోతుంది.
పంజా విసిరిన పులిసైతం స్థాణువై పోతుంది
మనమేలే మార్కెట్‌లో వాడి ఆగమనం
సూదిమొన దూరినంత సౌఖ్యంగా
గడ్డపార మొలిచినట్టు మెలికలు తిరుగుతూ
భారతావనిపై దండయాత్ర కొనసాగింపుగా
వాడి తెలివిని మన మూర్ఖత్వ బుర్రలపై
మత్తుజల్లి రామకీర్తన పాడించడానికి
జిత్తులు పన్ని ఎన్నో రకాలుగా మభ్యపెట్టి
మనల్ని దగా చేసి ఎగాదిగా చర్మం వొలిచి
కసాయి కోరకు వేలాడదీసి అమ్మబోతున్నాడు.
లైసెన్స్ వ్యాపారులే సెన్స్‌లేని వినిమయదారులు
సామాన్యులు వాడి కేంద్రంలో గడప తొక్కని అనర్హులు
దేశీయ ఉత్పత్తిని కబళించి ప్రత్యుత్పత్తిపై ఆంక్ష విధిస్తూ
ఇంతింతై వటుడింతై అనకొండై పాకిపోతాడు
పేటెంటు హక్కుతో పాగా వేసి పునఃప్రవేశిస్తాడు
చౌకైన సరుకులుగా ప్రకటించేసి
ఎదుగుదల ప్రతి ఒక్కర్ని వినిమయవిలీనం చేస్తాడు
చిన్న వ్యాపారుల జీవనాన్ని స్తంభింపజేస్తాడు
జనం విడిచిన వలువల్ని ధరించి అట్టహాసంగా
జాతి జీవనాన్ని నిర్వీర్యం చేసేస్తున్నాడు

# జ్వలితాగ్ని



**టి. విజయదుర్గ,**
**కర్నూలు.**
**94915 26994**

'పునర్జన్మ' లాంటి పురిటినొప్పులను,
సంతోషంగా భరించగలిగిన అతివ
అప్పుడప్పుడూ వచ్చే 'కడుపునొప్పి' తట్టుకోలేక
పురుగుమందు తాగేసిందట!
వంద మందికైనా ఒంటిచేత్తో,
వంట చేసి పెట్టగలిగిన వనిత
పొయ్యిమీద 'నీళ్ళు' కాగపెడుతుంటే,
ఒళ్ళుకాలి చనిపోయిందట!
సంధ్యాదీపాలు వెలిగించీ, వెలిగించీ
బ్రతుకే దీపపు వత్తిని చేసిన తరుణి
కిరసనాయిలు 'దీపం' వెలిగిస్తుంటే, చీరంటుకుని
'బూడిద కుప్ప'గా మారిందట!
వంచిన నడుము ఎత్తకుండా
రోజుకు పదహారు గంటలు పనిచేసే పడతి
భర్త 'అన్నం పెట్టమన్నందుకే' అలిగి
బిడ్డలతో సహా బావిలో దూకిందట!
ఈ "ఆత్మఘోష"ల జ్వలితాగ్ని
ఎవరికైనా కనిపిస్తుందా?
ఎవరినైనా కదిలిస్తుందా?
పచ్చి అబద్ధాలని తెలిసి తెలిసీ,
"స్పందన"ను సైతం మరచిపోయిన చోట
చట్టాలూ, మనుషులూ, మనసులూ,
ఈ "కాకమ్మ కబుర్లు" వినడానికి,
అలవాటు పడిపోయిన చోట,
"ఆత్మ సాక్షి" బతికుంటుందా? చనిపోతుందా?

# నెత్తుటి నెగళ్ళు వెలిగించొద్దు!



ఎస్.ఎన్.రసూల్, నంద్యాల.
94927 59181

ఓ ఉగ్రవాదీ!
నీవు రాజేసిన కాఠిన్యపు కార్చిచ్చులో
కాలుతున్న శవాల్ని చూడు
వేనవేల దగ్ధ గీతాలెన్నో పాడుతున్నయ్!
నీవు ఆడిన పైశాచిక క్రీడలో నిర్ధాక్షిణ్యంగా
తెగిపడ్డ కాళ్ళు, చేతుల నడుగు నడిచొచ్చి
నీ కళ్ళుపొడుస్తూ, నీ దురంతాల రాక్షసత్వాన్ని వివరిస్తాయ్!
విధ్వంసం కర్రకు నీవెగరేసిన తడి ఆరని
మానవ అవయవ రుధిర పతాకల్ని వీక్షించు
రక్త కన్నీరై వర్షిస్తూ, నీ క్రౌర్యం చాటిన
నీచత్వాన్ని కళ్ళకు కడ్తాయ్!
అమానవీయంగా నీవు సృష్టించిన మారణహోమాలు.
ఎందరి తల్లుల కంటి వెలుగుల్ని ఆర్పేశాయో
మరెందరి నుదుటి కుంకుమల్ని చెరిపేశాయో
ఇంకెందరి పసిమొగ్గల భవిష్యత్తాశల్ని చిదిమేశాయో
ఒక్కసారి 'మనిషి'గా ఆలోచించు ఆత్మావలోకనం చేసుకో
పశ్చాత్తాపంతో కుమిలి
నిలువెల్లా దుఃఖనదివై ప్రవహిస్తావ్
ఇకపై... మానవత్వానికి
మరణశాసనాలు లిఖించొద్దు
అమాయక ప్రాణాలతో
నగర వీధుల్లో నెత్తుటి నెగళ్ళు వెలిగించొద్దు
మనిషికి మనిషికి మధ్య
విద్వేషపు విషజ్వాల రగిలించొద్దు
కారుణ్యపు అమృతవర్షం కురిపించి
విశ్వ శ్రేయస్సుకు పరితపించు

# మతమంటే...



**కె. శంకర్రావు, పత్తికొండ**
**9642214256**

మతం తిరగేయ్ తమం
తమం తిప్పేయ్ మతం
కావున అదొట్టి అంధకారం
మరెందుకు దానిపట్ల మమకారం?
ఏ మతానికైనా పునాది విశ్వాసం
నిర్హేతుకంగా నమ్మడం
జనుల మనసులు వికసించనీయకుండా
మూఢ విశ్వాసాల ముసుగులో బిగించి
మనసులో మత రక్కసిని పెంచి
మానవతను మటుమాయం చేసి
ప్రజల కళ్ళకు రంగు రంగుల గంతలు కట్టి,
చెవుల్లో రకరకాల సీసపు గుళ్ళు క్రుక్కి
ఇదే న్యాయమనీ, ధర్మమనీ
తరుణోపాయమని, మోక్ష మార్గమనీ
రకరకాల మిథ్యా సిద్ధాంతాల్ని సృష్టించి,
అశేష ప్రజానీకాన్ని విశేషంగా వంచిస్తూనే
నిలుపుకొంటున్నారు కొందరు తమ అగ్రసనాధిపత్యం
ఆలోచించే శక్తినీ, వివేచించే యుక్తినీ
ఈ మత రాజకీయ మతాధిపతులు
స్వార్థంతో అణచి వేస్తూనే ఉన్నారు.
ఈ 'యోచనాత్మక విరోధం"
దీని నుండి బయట పడ్డప్పుడే మనం
నిజమైన మా "నవ" జాతిగా పురోగమించగలం!

# ఓ... బాపూ!



**పల్లోలి శేఖర్‌బాబు,**
**కొలిమిగుండ్ల.**
**94904 84316**

ఓ... బాపూ...!
ఇటు మరల్చు నీ చూపు
ఈనా భారతదేశం వైపు
విడుస్తావు గాఢమైన ఓ నిట్టూర్పు
పాదయాత్రలు చేసి ఉద్యమ ఖర్చులకై భిక్షమెత్తి
హరిజన వాడల్లో తిరిగి, మరుగుదొడ్లు కడిగి
చెంపదెబ్బలు తిని జైళ్ళలో నెలల తరబడి మ్రగ్గి
సత్యాగ్రహపోరాటాలు నిర్వహించి,
అహింసను ఆయుధంగా మలచి
భారతావనికి స్వాతంత్ర్యం తెప్పించి,
స్వేచ్ఛగా... ఐక్యతతో జీవించమని బోధించావు
రామ రాజ్యం గ్రామ స్వరాజ్యం కోసం పరితపించావు.
అయితే ఇక్కడంతా కులపోరాటాలు, మత ఘర్షణలు
బాంబుల దాడులు నరికివేతలు ఉగ్రవాద చర్యలు
అవినీతి బంధుప్రీతి లంచగొండితనం
కుంభకోణాలు నీతి మాలిన రాజకీయాలు
అత్యాచారాలు హత్యలు ముఠా తగాదాలు
ఆకలిచావులు అప్పులు ఆత్మహత్యలు
ఢిల్లీ నుండి గల్లీదాకా
రామరాజ్యం మాట వినటమే కానీ
కంటికి మచ్చుకైనా కనిపించటం లేదు
ఓ... బాపూ! నీవు తెచ్చిన స్వాతంత్ర్యం
ఖద్దరు జేబుల్లో మాఫియా కనుసన్నల్లోనే నలుగుతోంది
బక్క ప్రేగు నిత్యం బలైపోతుంది.

# కరువు కాలం - పేదోళ్ళ ఘోష



బి. హరిప్రసాద్, తుగ్గలి.
9966126035

మట్టిలోనే గట్టి శీలం
మలచుకునే టోళ్ళం!
తంగేడుపూల హారం తొడిగి
సింగారంగా తొంగి చూసే మా
పొలం గట్టు అందాలు
మేమెట్టా వదిలొత్తామనుకున్నారు?!
తురాయి పూల సొగసుతో
తులతూగే మా పల్లె రాదారుల్లోనే
మేం జీవన యానం చేయగలం
భక్ష పరమాన్నాలు కావు మాలక్ష్యం!
ఏదో కాలే కడుపుకు
మాలే గంజి అనుకునేటోళ్ళం!
పూటకు పొట్ట నిండితే
అంతే చాలనుకుంటాం!
అది అందని కరువు కాలమైతేనే...
ఇదిగో ఇలా నగర నడిబొడ్డున
బోరున విలపిస్తుంటాం
మా ఎదకోత మీకర్థమవ్వాలనే
ఆశతో శవాలై నడిచొస్తుంటాం!!
ఐనా కరువు కాలమొస్తే
గడ్డిపోచలు సైతం మా గుండెను
గుండుసూదుల్లా గుచ్చుతాయన్న
మీ సదువుకున్నోళ్ళకి
తెలియని విషయమా?!
మా లాంటి పేదోళ్ళని మరిస్తే
మీ సదువుకి అర్థం ఏది?
ఏం మాట్లాడరేం?
మా ఘోష విన్నాక...?

# సెక్యూరిటీ! ఎక్కడ నీ చిరునామా?



కె.పి.ఆర్. శర్మ, కర్నూలు.
91609 03300

రహదారులు విస్తరించగ
సైరన్‌కూతలాక్రమించగ
తనదు ఉనికి చెదిరెనని
చెట్టువగచెనట
సెల్ టవర్ రాకతో తనగూడు చెదిరెనని
పిచుకమ్మ బెదిరెనట
కేర్‌సెంటర్‌లో చంటోడికి తల్లిప్రేమ కరువట
మలిసంధ్యలో దంపతులిరువురికి
పిల్లల ఆదరణ ఆమడ దూరమట
ఈ తీరున నేడెటు చూసిన వలసల బారులు
ఎవరిని కదిపినా కన్నీటి వెతలు
పలకరించిన చాలు
అభద్రతా భావావిష్కృత కావ్య కృతులు
ప్రకృతి వైపరీత్యాలు ప్రళయాన్ని తలపిస్తుంటే
అమ్మాయిలపై ఆమ్లీకృతదాడులు హడలెత్తిస్తుంటే
మతరక్కసి కరాళనృత్యం బీభత్సం సృష్టిస్తోంటే
పసిమొగ్గలపై తుపాకీ నీడలు పశుత్వాన్ని తలపిస్తూంటే
ఇంకెక్కడి భద్రత???
శాంతి సుస్థిరతలను వెంటబెట్టుకొని
పత్తాలేకుండా పారిపోయె
కనిపించని సుదూర తీరాలకు!!!

# మనమే కదలాలి



ఇట్టం బాలకొండప్ప,
ఆదోని. 98857 61191

కోటీశ్వరులను ఎన్నికలబరిలో నిలిపి
మద్యాన్ని ఏరులై పారించి
జనాన్ని ప్రలోభాలకు గురిచేసి
అవినీతిని అందలమెక్కించి
ప్రజల సొమ్మును పర్సెంటేజీల కింద
పంచుకుంటున్నారు
    కంచే... చేను మేసినట్లు
    విస్తరణల పేరుతో... పాలకులు,
    పేదోళ్ళ గుడిసెలను, భూములను
    కొల్లగొడుతుంటే
    ప్రత్యామ్నాయ ఆశలు
    ఆవిరవుతుంటే
    ప్రజలు నిరాధారులూ
    నిర్భాగ్యులూ అవుతున్నారు
ఆంగ్లేయులకంటే అధికంగా
అధికారాన్ని చలాయిస్తూ
ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేస్తుంటే
ఎంతకాలం చూస్తూ ఉందాం?
ఇక మనమే కదలాలి
ఉద్యమాలకు ఊపిరులూదాలి.

# ఎక్కడ?



రమ్య, కర్నూలు

ఛీ! ఛీ! భ్రూణహత్య బ్రహ్మ హత్య!
ఛ! ఛ! స్త్రీ శిశుహత్య సిగ్గుసిగ్గు!
అయ్యో! వరకట్నపు చావులు నీచం
అన్నా! గృహహింస నికృష్టం!

కన్నా! ఆడదానిగా పుట్టడం కన్నా
అడవిలో మానుగా పుట్టడం మేలా?

ఈ ఇరవై ఒకటవ శతాబ్దంలో
ఇంకా ఎందుకు ఈ స్త్రీ వివక్ష?

నేస్తం! నీ తల్లి, నీ చెల్లి, నీ అక్క
నీ అత్త, నీ ఆలీ అందరూ స్త్రీలే గదా!

ఆమె లేనిది అతడు లేడుగా
అయినా ఎందుకు ఈ పక్షపాతం?
కొడుకు తలకు కొరివి పెట్టడం భ్రమ
కూతురు ఉద్ధరించదనుకోవడం వెర్రి!

నీ పిచ్చి చేష్టలతో ప్రపంచంలో
అంతరించి పోతున్నది ఆడజాతి!

ఆడది లేనినాడు ఆత్మీయత ఎక్కడ?
కుటుంబం లేనినాడు సంఘం ఎక్కడ?
సమతుల్యత దెబ్బతింటే నీతి ఎక్కడ?
అమ్మలేని నాడు నీ ఉనికి ఎక్కడ?

ఎప్పుడైనా, ఎక్కడైనా స్త్రీని గౌరవించే దేశమే
తులతూగుతుంది సిరి, సుఖశాంతి సంతోషాలతో!

# పదముందుకు...



**యం. సోమభూపాల్,**

**ఆస్పరి.**

**97046 00562**

పద ముందుకు వ్యధ ఎందుకు కదనమందు వెనుకడుగా
పదునందుకు పరుగిడిరా సరి ఎవ్వడు లేడుగా
ఎంతసేపు చీకటిలో నిదురిస్తూ మసలుతావు
లక్ష్యమెదురు చూస్తోంది విదిలించుకు లేచిరా
జీవితం లేదు నీ చేతి గీతల్లో
అది వుంది అనుక్షణం నువు చేయు చేతల్లో
ప్రతి అడుగూ లక్ష్యముకై పరితపించిపోతుంటే
నిన్ను బంధిస్తుందా దుఃఖపు బంధిఖానా
అడుగొక్కటి మొదలెట్టెయ్ గమ్యమెంత దూరమైనా
ముంచేసే ప్రళయమౌను చినుకెంత చిన్నదైనా
విధివేటకు భయమా విజయం విధి తరమా
తుది పోరుకు తలపడరా వీరుడిలా నిలబడరా
కడలినైన తాగేసే కసి నీలో వుంది
విశ్వమైన చుట్టేసే వేగం నీకుంది
ఉరుముల మెరుపులతోనే వర్షం మొదలవుతుంది
ఉదయపు వెలుగులతోనే చీకటి పరిగెడుతుంది
నది నురుగై ఆరిపోక నలుగురిలా పారిపోక
నడుమును బిగగట్టరా! పయనం మొదలెట్టరా!
భయంకర సుడిగుండాలుండేదే సముద్రం
భయపెట్టే సమస్యలను కలిగినదే జీవితం
నెత్తురావిరయ్యిందా శక్తి ఆరిపోయిందా
గమ్యం కనబడలేదా? నా గళము నువ్వు వినలేదా??

# యువశక్తి



**పారా దేవ ప్రకాశ్,**

**కర్నూలు.**

**98663 53534**

యువతా ఓ యువతా
నీ కనుచూపుల వీక్షణం
ప్రాపంచిక నిశిని పారద్రోలే
మహా కాంతికిరణం కావాలి
దేశానికి వెలుగునిచ్చే దీపం కావాలి
శత్రువులకది ఒక అగ్నిగుండం కావాలి!
నీలోని రక్త ప్రవాహం
పొంగుతూ పొర్లుతూ పలకరిస్తూ
భయం గొల్పుతూ భుజం తట్టుతూ
ఆవరిస్తూ అడ్డునిలుస్తూ
హోరెత్తే కడలిలా
ఉప్పొంగే శక్తి, నీకుండగా
ఎందుకంతగా నీరసిస్తావు?
వెతలు చూసి చిన్నబోతావు?
యుక్తితో ముందుకురికితే
పరాక్రమంతో విజృంభిస్తే
దేశమంతా సస్యశ్యామలం
ఇక సౌఖ్యం అందరి వశం

# ఓ బడి



**డి. ఖాజాబి,**
**కర్నూలు**

ఏమిటి? ఎందుకు? ఈ వేలం వెర్రిపోకడలు?
పులిని చూసి నక్కవాతపెట్టుకొన్నట్లు
దేశంలో గొప్ప విద్య ఒక్క ఆంగ్లబడిలోనే
దొరుకుతుందని తేల్చేసిన ప్రజలు
బిడ్డపుట్టక ముందునుండే ఆలోచనలు
కాన్వెంటు క్యూలో! శిశువు యల్కేజిలో ఎంటర్
తల్లి ఒడికి చిరుప్రాయంలోనే దూరం దూరం
బిడ్డ బాల్యం ఆంగ్ల బడిలో పాపం! ఖతం ఖతం!
దేశ నేతలను అందించిన మహా మహా
ప్రభుత్వ కళాశాలలు నేడు వెలవెల
పొంగుల కాన్వెంట్లతో పోటీ పడలేని
హంగులు లేని ప్రభుత్వ పాఠశాలలు
తుఫానుకు నేలకూలిక శోక వృక్షాలు!
దిక్కు మొక్కులేని అనాథల మొహాలు!!
బీద విద్యార్థులకు మాత్రం బడులు బడా నిలయాలు
అర్ధాకలితో మాడే సగటు పిల్లలకు దేవాలయాలు
పంతుళ్ళ పిల్లకాయలకు సైతం
కాన్వెంటు స్కూళ్ళ చదువులు
దేశనేతల వారసులు తొక్కరు సర్కారు స్కూళ్ళు
లక్షలు కట్టి చదువు కొనుక్కోవడం స్టేటస్సింబల్!
కమ్మని వ్యక్తిత్వ వికాసం అందించే ఓ సర్కారు బడి
నన్నాదరించమంటూ వేడుకుంటోంది మరీ మరీ....

# చెట్టును నేను



**కె. ఈశ్వరప్ప, ఆలూరు**
**98853 36985**

చెట్టును – ప్రగతికి మెట్టును
నడుములోతు భూమిలో
కూరుకుపోయి ఉన్నా....
మొండిగ జీవిస్తున్నా...
నా వాళ్ళెవరు లేకపోయినా
మాటలాడని మౌనిలా నిలుచున్నా
ఆహారం కోసం అవస్థలు పడుతున్నా
భూమిలోని నీటిని పిండి
ఎరువుల ద్రవాన్ని
వేర్ల సిరంజిద్వారా
సెలెన్ బాటిల్స్‌లా ఎక్కించుకుంటున్నా
పరోపకారమే గాని
పరులకు హానిచేయనిదైనా
కొందరు స్వార్థంతో తమ సంపదల కోసం
నా జీవితాన్ని మోడు బారుస్తున్నారు.
అయినా మళ్ళీ చిగురిస్తున్నా...
అందుకే!
నా జీవితమే ఒక సందేశం
ఆలకించి, ఆచరిస్తే
మనిషి మహనీయుడౌతాడు

# చైతన్యం



**కె.సి. మల్లికార్జున,**
**ఆదోని.**
**80081 45357**

కదలికయే చైతన్యం
కదుపుటయే చైతన్యం
శోధనమే చైతన్యం
సాధనమే చైతన్యం
విద్యార్థికి విధ్యర్థం
బోధపడిన చైతన్యం
నాయకులు స్వార్థమొదిలి
సేవలెంచ చైతన్యం!
ముసలవ్వకు ముతకయ్యకు
ముదముతోటి మదములేక
జాలి చూపి చేరదీసే
విధము చూడ చైతన్యం!
దుర్జనులు సజ్జనులై
సంస్కర్తల జాడ తెలిసి
దాతలై దూతలై
సేవచేస్తే చైతన్యం!
కలిమినాడు మైమరువక
వెలితినాడు కుమిలిపోక
స్పర్శచేత స్పర్థ చేత
జీవించుట చైతన్యం!
ఉన్నవాడు లేనివాడు
హెచ్చుతగ్గు కానేకాదు.
జనులందరు సమమంటు
ముందుకెళ్తె చైతన్యం!!

# అక్షయ సాధం



డా॥ కల్లూరి
ఆనందరావు,
మహానంది
94909 57266

కలం కాలుగాలిన పిల్లై

సంప్రదాయాన్నీ, స్వాతంత్ర్యాన్నీ
అభిజాత్యాన్నీ, అభ్యుదయాన్నీ
శ్రామిక శక్తినీ, యాంత్రిక పుష్టినీ
ప్రజాస్వామ్యాన్నీ, ప్రపంచీకరణాన్నీ
మంటికీ, మింటికీ ఏకధారగా కన్నీళ్ళు పెడుతోంది.

వివక్షలై, విస్ఫులింగాలై వికటాట్టహాసం చేస్తే
సమవర్తియై, సుమశాంతమై, మధుహాసమై
అక్షర సమరం చేసిన కలం
నేడు అస్త్ర సన్యాసం చేస్తూ కళవళ పడుతోంది.

అల్లా హో అక్బర్ అంటూ నినదించిన కలం
పదార్థాన్ని పరమార్థంగా మలిచిన కలం
సమవాదాన్ని చాటి చెప్పిన కలం
ఆర్ద్రతకు ఆలంబనగా ఎలుగెత్తిన కలం
ప్రేమకు ప్రాణంగా పరిమళించిన కలం

శాసనమైన కలం, శ్వాసను వీడని కలం
ఒంటరిదేమోనన్న క్షణం
వియత్తలంలో విరాట్ స్వరూపంగా
మొగులు వేలార్చే కలంతో.

# రెయినీ మూడ్ చిల్డ్రన్



డా॥ ఆంజనేయుడు,
కర్నూలు
94947 36351

బాలలం – దేవుని స్వరూపులం – మీ ప్రతిరూపాలం
ఆశలకు, ఆశయాలకు హద్దుల్లేని సరిహద్దులం
బాలలం – వెన్నెల ముద్దులం – చీకటికి ముద్దలం
చూపులు మరలని – కోవెల తలవని
నూతన భాగ్యులం – అభాగ్యులం
బాలలం – నిందాభగ్నులం – నిమగ్నులం
కూర్చితే మహోన్నతులం
విసిరితే అమాయకులం
మాయని మచ్చలం, గాయాలం
బాలలం – ఆకలికి అలంకృతులం
ఆనందానికి అనంత శృతులం
మీ బలం – బలహీనతలం
బాలలం – తీరని తృష్ణకు ప్రతినిధులం
నిర్లక్ష్యానికి ప్రతీకలం
బాలలం – పునాదులం, ప్రధానులం
రక్షకులం, నిర్దేశకులం
సారథులం, కీర్తి పతాకలం
గ్లోబలైజేషన్‌లో జ్ఞానులు హర్షించిరి
సర్రోగేట్ చిల్డ్రన్, అన్‌వాంటెడ్ చిల్డ్రన్
ఇంపల్సివ్ బార్న్ చిల్డ్రన్ అరైవ్డ్
ప్రొజెక్షన్‌లా వెలిగే రూపాలు
చిల్డ్రన్ ఫ్రస్ట్ ఇన్ టు సొసైటి
కుమారుల కుమారులు వృద్ధులకు కిరీటాలు
తల్లిదండ్రులే బిడ్డలకు కైసేయులు

# జీవకళ.... కవిత్వం...



**ఆవుల బసప్ప,**
**ఆదోని**
**87902 57601**

మానవీయ మూలాలను వెదుకుతూ
మది తంత్రుల్ని మీటే జీవకళ కవిత్వం
బతుకే భారమై నీరసించే కవి కలం
ఆధునికతతో అలజడులు రెట్టింపైన మనిషికి
కావాలి స్వాంతన
ఒత్తిడి మనసుకి అక్షరమే సేద
ఆత్మీయ అనురాగం పంచే అమ్మలా
హితం కోరే మిత్రునిలా
వెన్నుదన్నుగా నిలబడే తండ్రిలా
మార్గ నిర్దేశనం చేసే గురువులా
జీవిత తత్వాన్ని ప్రబోధించే తాతలా
మానసిక రోగాల వైద్యుడిలా
పక్షికి పచ్చని వృక్షంలా
సామాజిక రుగ్మతలకు
దైవకణం కవిత్వం, అది నిత్యజీవం.
దాని రూపం, ప్రక్రియ మారుతుంది
వెండి తెరపై కొత్త కళనై
బుల్లి తెరపై నవగొంతుకనై
సెల్‌ఫోన్‌లో స్మార్ట్‌యాప్స్‌గా
కలం వదిలి మౌస్ చేతబట్టి
ఆవిష్కరిస్తా అంతరంగాన్ని అంతర్జాలంలో
ఇ-పేజీల ట్విట్టర్లతో ట్విస్టిస్తా...
మనసుని కదిలించి కరిగించి
నవరసాల అనుభూతి కలిగించే
నవ కవనాన్ని విరచించెద.

# మానవత్వమా నీ చిరునామా ఎక్కడ?



**ఎన్. వాణి**
**నంద్యాల**
**9642140489**

మానవత్వమా నీ చిరునామా కావాలి
జీవనయానంలో మనిషిని వెదికేందుకు!
మళ్ళీ మళ్ళీ అడుగుతున్నా
ఊపిరి ఉన్నంతవరకు అడుగుతూనే వుంటా
నేను నేనుగా జీవించేందుకు నీ చిరునామా కావాలి.
గాయపడిన గుండె బరువెక్కుతోంది
అంతరంగాన అనంతమైన సవ్వడి
గ్లోబలైజేషన్ మాయలో గ్లోబుగా మిగిలిన మనసు అలజడి
చిల్లుల ప్రపంచం చిత్రంగా అగుపిస్తోంది.
అంతటా సమస్యల సుడిగుండాలు, పెను స్వార్థపు ఊబి
పేదరికాన్ని తలదన్నుతూ రాజకీయ దారిద్ర్యం
కలల తోరణాలు వ్రేలాడుతూ ఆశయాల వాకిళ్ళు
ఆశగా ఎదురుచూస్తూ జీవన ఆరాటం
హృదయం ఛిద్రమై కన్నీళ్ళమయం
దృతరాష్ట్రులమై బ్రతుకుతున్నందుకు
బ్రతుకు గాయం పొరపాట్లే అలవాట్లై
మానవీయ బంధాలకు చెదలు పట్టి
ధన బంధంలో బంధీలమై
మమతానురాగాలు గోడకు గట్టిన ఫ్రేములై
స్వచ్ఛమైన నవ్వులు, ఎప్పుడో మటుమాయమై
నేడు వాకిళ్లలో వ్రేలాడే ప్లాస్టిక్ పువ్వుల్లా అంతకంతకూ
అందుకే అడుగుతున్నా మానవత్వమా ఎక్కడ నీ చిరునామా?

# రా! లేచి రా!!



**రంగనాథ రామచంద్రరావు,**
**ఆదోని. 92900 50229**

రా! లేచి రా!!
వింటి నుండి వదిలిన ఫల్గుణుడి బాణంలా
కంటి నుండి విదిలిన క్రోధాగ్ని కణంలా
బ్యారెల్ నుండి కలిని కరుకు తూటాలా
కారు మబ్బుల్లో మెదిలిన మెరుపు బావుటాలా
రా! లేచి రా!!

గ్రుడ్డు మీద కూర్చున్న కోడిలా
విడ్డూరంగా వీధుల్లో నిల్చున్న పేడిలా
మురుగు కాలువలో దొర్లుతున్న బలిసిన పందిలా
మురిగిన సంప్రదాయపు జైలులో పొర్లుతున్న అలసిన బందీలా
మూలగా కూర్చోక
మాలగా వాడిపోక
రా! లేచి రా!!

మనపై కన్నువేసే
మన వెన్ను విరిచే
దుఃఖాల దుర్మార్గులపై
నిరాశా రాకాసులపై
తుఫానులై విరుచుకు పడేందుకు
కృశాలనులై విరుచుకు తినేందుకు
నిన్నటి నీ వెన్నులో ఆత్మవిశ్వాసాన్ని నింపుకుని
కన్నీటితో నిన్ను నీవే ఆయుధంగా మలుచుకుని
రా! లేచి రా!!

# అక్షర శిల్పి



**షేక్ అబ్దుల్ సమద్,**
**నంద్యాల**
**94406 55753**

నా అంతరంగంలో అనంతంగా కదలాడే భావాలు
అక్షరాకృతి దాల్చి
అభ్యున్నతి శిఖరాలనధివశింపగలిగితే
అది కవిత్వమనుకుంటా
నా కలములో కదలికలన్నీ
అవనత వదనాలకు అభ్యుదయం చూపిస్తూ
నిత్య మంగళం నిర్దేశిస్తే
అది కవితనుకుంటా
నా పాళీ విన్యాసాలు నిర్భయల రక్షా కవచాలై
అజ్ఞానాంధకారాలపై కాంతిరేఖలు ప్రసరిస్తే
అది అక్షర దీపమనుకుంటా
నా కలములో ప్రతి సిరా బొట్టు
అక్రమాలను, అన్యాయాలను అరికట్టే
అవినీతిని మట్టు పెట్టగలిగితే
అది అక్షరాభ్యుదయం అనుకుంటా
నా అక్షర లక్షల లయలు
అలలై కసాయి హృదయాల కాఠిన్యాలను కడిగేస్తే
కలువల్లా ఆ మనసులు వికసిస్తే
అది అక్షరార్చననుకుంటా
నాయీ కవిత ప్రజాభిప్రాయాలను ప్రతిబింబిస్తే
విశ్వశాంతి వినూత్న విప్లవాలనందిస్తే
నేను అక్షరశిల్పి ననుకుంటా.

# జయం.. మనదే.



**మనోహర్,**
**కర్నూలు**
**98667 58134**

ఒక జననం... ఒక మరణం...
ఒక మరణం... ఒక జననం...
ఇది అనునిత్యం చర్విత చరణం...
ఒక విజయం.... ఒక అపజయం...
ఒక అపజయం... ఒక విజయం...
ప్రతి జీవితంలోనూ ఇవి సహజం.... సర్వసాధారణం
శాశ్వతం కాదు అపజయం.
కలకాలం కలిసిరాదు విజయం.
అపజయానికి కృంగడం.
జయానికి పొంగడం
మన నైజం కాకూడదు.
సూర్యుని నుంచి భూమికి చేరిన
సూర్యకిరణాల వేడి ఎంతవరకు...?
సాయం సంధ్య రాక మానదు.
రాతిరి చల్లని వెన్నెల కురియక మానదు.
ఓపిక పడితే...
సాయం సంధ్య మనదే...
చల్లని వెన్నెల మనదే...

# రెండంచుల ఖడ్గం



**సూర్యపోగు, ఆదోని**
**94412 94015**

అవినీతి నశించాలి....
కార్యాలయాల్లో, ఖార్ఖానాలల్లో,
ఆలయాలల్లో, ఆశ్రమాలల్లో
లంచం, అక్రమం, దుర్నీతి,
అన్యాయం, అధర్మం, బంధుప్రీతి
పేరేదైనా..... తీరేదైనా....
ఊరూవాడా, పల్లెపట్నం... మమేకమై...
ఖండించాయి... ఖడ్గం దూశాయి.
కానీ... అది రెండంచుల ఖడ్గమేనా?

ముష్కరులను శిక్షించాలి....
ఢిల్లీ వీధుల్లో, గల్లీ అవధుల్లో
కాలేజీ దారుల్లో, క్యాబ్ పరదాల్లో
రేపు, చెరుపు, బలవంతం
శీల శిథిలం, మానభంగం
పేరేదైనా.... తీరేదైనా....
ఊరువాడా, పల్లెపట్నం... ఏకమై
ఖండిచాయి... ఖడ్గం దూశాయి
కానీ... అది రెండంచుల ఖడ్గమేనా?

ఉగ్రవాదం అంతమవ్వాలి....
రాష్ట్రాలల్లో, దేశాలల్లో
పాఠశాలలో, పబ్లిక్ ప్లేసుల్లో
ఉన్మాదం, మతోన్మాదం
అతివాదం, తీవ్రవాదం
పేరేదైనా.... తీరేదైనా....
ఊరువాడా, పల్లెపట్నం... ఏకమై
ఖండిచాయి... ఖడ్గం దూశాయి
కానీ... అది రెండంచుల ఖడ్గమేనా?

# ఇజాలు - నిజాలు



**పి. ఎలిషా జయరావు,**
**పాములపాడు**
**90004 95549**

ఆదిమ సమాజం - అందరూ సమానం
అందరు కలసి పనిచేయడం అందరు కలసి
అనుభవించడం
రాజరికం -నియంతృత్వం కొందరికే అవకాశం
మెజారిటీకి బానిసత్వం
ఫ్యూడలిజం - అంటే పులి
అది పచ్చి నెత్తురును వెచ్చగా త్రాగుతుంది
కేపిటలిజం - అంటే ఖరీదైనది
ఖరీదైన ఆసుపత్రిలా అది మన మంచికే నన్నట్లు రక్తాన్ని చల్లగా తాగుతుంది
ప్రజాస్వామ్యం - అంటే చల్లగా పడుకో బెడుతుంది
తనపని తాను చేసుకు పోయే
గుంపు దొంగల దోపిడి
సోషలిజం - అంటే అందరు సమానం
కొందరి దగ్గర వున్నవి అందరు అనుభవించడం
కమ్యూనిజం - అంటే అందరు ఒక్కటే
అందరి దగ్గర ఉన్నవి అందరూ సమానంగా పొందటం.

# యువతా మేలుకో!



**డా॥ ఎన్.కె. మద్దిలేటి,**
**కర్నూలు. 94402 55110**

ఎన్నికల వేళ మాత్రమే
ప్రజల కష్టాలు గుర్తుకొచ్చి
ఊకదంపుడు ఉపన్యాసాలతో
ఓటర్లకు గాలం వేసే
ప్రజాప్రతినిధులను
ప్రశ్నిస్తూ, పడదోస్తూ...
            యువతా మేలుకో
            ఓటు విలువ తెలుసుకో!
మాటల గారడీతో
ఎన్నికల వాగ్ధానాలు కురిపిస్తూ
తిమ్మిని బమ్మిని చేసే
కుటిల నేతలను
నిలదీస్తూ, నినదిస్తూ...
            యువతా మేలుకో
            ఓటు విలువ తెలుసుకో!
స్కాములతో స్వాహా చేస్తూ
సామాన్యులకు సేవచేయని
స్వార్థ రాజకీయ నాయకులను
ఎండగడుతూ, ఎదిరిస్తూ....
            యువతా మేలుకో
            ఓటు విలువ తెలుసుకో!
అవినీతి వాటాలతో
యువత భవితను కాలరాసిన
నాయకుల తలరాతను
కాలరాస్తూ, కడిగేస్తూ...
            యువతా మేలుకో
            ఓటు విలువ తెలుసుకో!

# ప్రపంచమా! మేలుకొనుమా!



డా॥ ఎ. సంజీవరాయుడు
కర్నూలు

ఆడుతూ, పాడుతూ నవ్వుతూ తుళ్ళుతూ
చదువులమ్మ ఒడిలో పిల్లలు
ఓలలాడుతూ ఉన్నారు.
అదే సమయంలో
భయంకర వింత ఆకృతులు
కరాళనృత్యం చేస్తూ, అనాగరికంగా
పిల్లలపై బుల్లెట్ల వర్షం కురిపించారు.
పిల్లల రక్తంతో రాగాలాపన చేశారు.
పువ్వులాంటి పిల్లలను చిదిమివేశారు.
చిగురుటాకులాంటి పిల్లలను తుంచి వేశారు.
చిలుక పలుకులు పలికే పిల్లల గొంతులను కోసి వేసారు.
స్వేచ్ఛగా విహరించే విహంగాలను కూల్చివేశారు.
ఓ ప్రపంచమా! ఇకనైనా మేలుకొనుమా!
ఉగ్రవాదులకు ఊతమిచ్చే
మనుషులను, సంస్థలను
కట్టగట్టి సముద్రంలో పడేయాలి.
అప్పుడే పువ్వులు తమ పరిమళాలను వెదజల్లుతాయి
చిగురుటాకు మారాకు వేస్తుంది.
విహంగాలు గగన తలంలో స్వేచ్ఛగా విహరిస్తాయి.
అప్పుడే ప్రపంచశాంతి
అప్పుడే కొత్తబంగారు లోకం.

# మేలుకోండి - ఏలుకోండి



**బండారి హనుమంతు,**
**ఆదోని.97037 23703**

ధన దాహంతో అధికార వ్యామోహంతో
అత్యాశతో మానవత్వానికి మట్టిగొట్టి
అవినీతి మార్గం పట్టి
నీతికి, నిజాయితీకి నిప్పుపెట్టి
న్యాయానికి, ధర్మానికి
త్యాగానికి సమాధి కట్టి
అధికార పీఠం కొరకు
అడ్డదారులలోన నడిచి
అధికారాన్ని చేబట్టి
స్వార్థపాలన నడుపుతున్న
నాయకులకు బుద్ధిచెప్పగ
ప్రజాస్వామ్యాన్ని తెలిసి
పాలించగ
ఇకనైనా మేలుకోండి.
పౌరులారా ఏలుకోండి.
నవ సమాజాన్ని స్థాపించండి.!!

# బ్రతుకు రథం



ఎలమర్తి భావన,
కర్నూలు.

భారతీయ సంస్కృతి సర్వసంస్కృతులకు సారథి
వివాహబంధానికి గట్టి పునాది
పాశ్చాత్య దేశాలచే అందుకుంది ప్రస్తుతి
ఆదర్శ దాంపత్యానికి వినుతి గాంచెనీ ధరిత్రి
పాశ్చాత్య విష సంస్కృతి నుంచి
వెదజల్లబడిన బీజాలు
ఇప్పుడిప్పుడే ఈ పుణ్యస్థలిలో
మెలమెల్లగ మొలకెత్తుతున్నాయి
స్త్రీ పురుషుల కలయిక
సుఖానికి బదులు దుఃఖాన్ని
మిగుల్చుతున్న విపత్కర పరిస్థితి!
హెచ్చైవి విజృంభణం
జీవితం భయ కంపితం
ఈ భయాలకు చెల్లుచీటినిద్దాం
మన కుటుంబ వ్యవస్థకున్న విలువను, గొప్పతనాన్ని
చాటించగ కదలాలి, జనం మనం తక్షణం
నిగ్రహమనే ఆయుధాన్ని విస్మరిస్తే
తప్పదు అనర్థం
ఆరోగ్య భారతం కోసం
చైతన్యమై అడుగుముందుకేస్తే చాలు!
కొత్తగా కనిపెట్టవలసిందేమీ లేదు
ధర్మం తప్పకుండా మనుగడ సాగిస్తే చాలు
దంపతులు ఒకరికొకరు అనుకుంటే చాలు
అదియే శుభకరం, సుఖజీవనం

# ఆర్తనాదం



జి. నల్లారెడ్డి, ఆదోని
98855 15715

చినుకురాక, మొలకరాక
విత్తులన్నీ ఎండిపోయే
బతుకుబండీ నిలిచిపోయె
నలుగురిలో పరువుపోయె
కరువుతోన కృంగిపోయె!
పైరు కోసం భుక్తి కోసం తెచ్చిన
అప్పుబాధలు పెరిగిపోయె
వడ్డీలతో నడ్డివిరిగె
బ్యాంకు రుణములు ఇవ్వదాయే
పిల్ల జల్లా పస్తులాయే!!
కూటికొరకు గూడు కొరకు
చింతలెన్నో చేసి చేసి
చావలేక బతకలేక
గావు కేకలు ఎన్ని పెట్టిన
చేయూతనిచ్చే చేయికోసం
ఎదురు చూసిన, ఎంతవేడిన
పాలకులు స్పందించరైరి
అన్నదాత బతుకులోన
"ఆర్తనాదం" మిగిలిపోయే

# మహిళకు విలువ లేదా?

ఛార్మింగ్ ప్రిన్స్ (కలం పేరు),
గడివేముల.98492 73993

అమ్మాయిగా పుట్టింది
నువ్వే... మాతృత్వపు
మధురిమలు కురిపించ
దుర్మార్గుల చేతిలో వంచింప

అనితర సాధ్యురాలివి
నువ్వే... మహిళామణి
మనస్సు మెత్తగా చేసుకుని
దుష్టుల ప్రేమలో బలిగా

అద్వితీయ జీవనసారథి
నువ్వే... భార్యవై
మధువు త్రాగిన భర్త
దుర్లభ మనస్సులో వంచితగా

అపురూపమైన ఆడబొమ్మ లనే
నువ్వే... సినీనటిగా
మగాడు అల్లిన కథల సాలెగూడులో
దుఃఖించలేక – నవ్వలేక

అరుదైపోతున్న ఆడపిల్లవు
నువ్వే... ఎక్స్‌రేల మాటున
మగపిల్లాడికున్న రేటింగ్‌తో
దులిపేసుకుంటున్నారు కుప్పతొట్టిలలో

అవనిలో... తారవు
నువ్వే... మెరిసి మాయమైనట్టు
మధుర కవుల వర్ణనలో సౌందర్యపు
దుర్నీతి నిండిన ప్రపంచంలో 'విలువ' లేదు నీకు

# అమ్మా! అమ్మనవనా?

భారతీ గోపాలకృష్ణ,
కర్నూలు

నీలోని అమ్మతనం ఏమయింది?
మూర్తీభవించిన ప్రేమతత్వం ఎందుకు లోపించింది?
నాగురించి నీవు కన్నకల కల్ల ఎందుకయింది?
ఎందుకమ్మా నీ హృదయం అంత కఠినమయింది?
నా చిట్టి చేతులతో నిన్ను తాకాలని
నా లేలేత పెదవులతో నీక్షీరామృతాన్ని గ్రోలాలని
నీ వెచ్చని ఒడిలో నిదురించాలని
నీ నవ్వుల పలకరింతలో మురిసిపోవాలని

ఎన్నెన్ని ఆశలు, ఎన్నెన్ని కలలు
ఎన్నెన్ని కలలు
ఎన్నెన్ని కోరికలు

రూపమైనా సరిగా ఏర్పడకనే నీరూపాన్ని కనులారా చూడకనే
ప్రసవాబ్ధిన పయనించకనే ప్రపంచాన్ని దర్శించకనే

ఆడపిల్లనని తెలుసుకొనినావు
అర్థాంతరంగా నా ఊపిరిని ఆపావు.

# బహుజనుడు



**సింధూ నాగేశ్వరరావు యాదవ్**
**కర్నూలు**
**సెల్: 73867 27588**

నేను ఊరి మధ్యస్థాన్ని
అందరిలో కలిసి జీవిస్తూ
అందలాల పొందికలో కలవని వాణ్ణి
నేను ఊరు వాకిలిని
తలుపులు లేని కాపలాదారుణ్ణి
నేను ఊరి ముఖద్వారాన్ని
సమస్త వృత్తుల చిహ్నాన్ని
నడివీధిలో వుంటూనే నడ్డిరిగిన నాగరికుణ్ణి
నేను బహుముఖాన్ని
పగిలిన మట్టి కుండను
తెగిన నూలు పోగును
గురి తప్పిన వేటగాడిని
బండనైన గుండెకాయను
ఎండిన పాల పొదుగును
అడవిలోని వెదురును
ఖాళీ అయిన లొట్టెముంతను
కల్తీ లేని గోల్డ్ కవరింగును
ఆధునికతకు గుర్తుగా
దిష్టిబొమ్మలా వ్రేలాడిన వాణ్ణి
నిరాడంబరుణ్ణి, నిప్పుల కొలిమి ప్రేమికుణ్ణి
యుద్ధతంత్రం ఎరిగి చక్రం తిప్పే సైనికుణ్ణి
రాజకీయ కుతంత్రంలో అంటరాని వాణ్ణి
అన్నీ నేనై తెలుసుకున్నాక
నేను చతురుడను, పాలితుడను
నవయుగ నిర్మాణకర్తను
నేను బహుజనుడను, బహుజనుడను

# చూడు చూడు నీడలు




**కె.ఎన్.ఎస్. రాజు**

**కర్నూలు**

**97015 08809**


నగరం నడిబొడ్డుమీద ఓ నాటకం!
సుందరదృశ్యాలు లేవు
ఒళ్ళు బలిసిన హీరో హీరోయిన్లసలేలేరు
అర్ధనగ్న ప్రదర్శనలంతకన్నాలేవు
నాటకం రసపట్టులో ఓ 'ఫేడోప్లే'
చూడు చూడు నీడలు!
    స్మశానంలోంచి లేచి నడిచి వస్తున్న
    మానవ అస్థి పంజరంలా...
    వ్యవసాయంలో ముందు దగా, వెనక దగాతో
    కృంగి బక్కచిక్కన కర్షక వర్గాల దేహాలు!
వయోభారంతో వంగిపోయిన శరీరాల్లా...
అధిక ధరల భారంతో నడ్డి విరిగిన మానవాకారాలు!
శవాలను పీక్కు తినే రాబందుల్లా...
మనిషిని మనిషే దోచుకతినే నరరూప రాబందులు!
    అర్ధనగ్న సుందర నారీమణుల్లా...
    చిరిగిన గుడ్డల్లో అవయవాల అందాల్ని
    దాచుకోలేని నిరుపేద స్త్రీలు!
    చూడు చూడు నీడల్లో - నీలో ఒకింత
    కామోద్రేకపుటలల ఆవేశం చిగురిస్తుందేమో?
బ్రతుకు పైనే వేదన జనించి - నీ మస్తిష్కంలో
వేదాంతం గిరగిర సుళ్ళు తిరుగుతుందేమో?
లేక మరో మహాప్రస్థానానికి పునాది పడుతుందేమో?
చూడు చూడు నీడలు.

# వెలుగు రవ్వలు



డా॥ పి. విజయ్‌కుమార్,
కర్నూలు
98493 02546

ఇదా ఇదా సమసమాజ నిర్మాణము
ఇదేనా సకల జనుల కల్యాణం
ప్రతి పనిలో ప్రతి గనిలో కార్మికులం
ఈవనిలో అనాథలం
నేటి బాలలే భావి భారత పౌరులని నినదించే ఈ లోకం
మానవసేవే మాధవసేవ సృష్టించింది ఈ సమాజం.
అనాథ బాలల దారుణ బతుకులు మార్చేదెవరు
ఆకలి అగ్నిజ్వాలలు ఆర్పి చేరదీసేదెవరు.
ఎవరికి వారే యమునాతీరే, దీన్ని అబద్ధం చేయాలి
ఒకరికి ఒకరు, అందరం ఇది ఆచరించాలి
మలయజశీతల సస్యశ్యామల దేశం మనదని అంటారే
విలయతాండవం చూసే బ్రతుకుల ఒక్కరైనా దరిచేరరే
ముక్కు పచ్చలారని పసిపిల్లల ఊడిగాన్ని ఆపేయరే
పొద్దు పొడుపుల ఎదిగే వయస్సు పచ్చనవ్వు పూయించరే
చెమటబొట్లు చిందించే బాలల సంస్కరించి చదివించరే
వెలుగు రవ్వలగు బాలకార్మికుల వ్యసనం వెతలు తీర్చ స్పందించరే
మనుషులు మారే మరో ప్రపంచం వచ్చేదేనాడు.
మనసులు పంచే కొత్త ప్రపంచం చూసేదేనాడు

# స్వప్నం



**ఎం. శ్రీసుధ,**
**క్రిష్ణగిరి గ్రామం, డోన్**

ఆకాశంలో సగం అందమైన భావన!
యత్రనార్యస్తు పూజ్యంతే... నిజమా... అనిపిస్తుంది.
తరతరాలుగా అణచివేయబడటం అలవాటైపోయిన జాతి
శిరసెత్తుకు తిరగాలని... బాధ్యతలనే కాదు హక్కుల్ని కూడా
అనుభవించాలను కోవడం తప్పా?
కట్నపు కోరల్లో... కామాంధుల వికృత చేష్టల్లో
మసిగా మధ్యలోనే ఆవిరై పోతున్న జీవితాలు!
అర్థంలేని ఈగోలు ఈగల్లా ముసిరి
అబలల ఆర్తనాదాలు మధుర గీతాలాపనగా ఆలకిస్తుంటే...
నిర్భయోదంతాలు నిర్భయంగా జరుగుతాయి.
చట్టాలు చట్టుబండలవుతాయి.
అధికార దండం ఆర్థికదండం చెట్టాపట్టాల్ వేసుకొని చరిస్తే
లింగ వివక్షతో భ్రూణహత్యలు పెరగక ఏంచేస్తాయి?
జనాభాలో లింగ నిష్పత్తి పడిపోక ఏమవుతుంది?
అనురాగాల వల్లి అని ఆప్యాయతల మల్లి అని
ముఖస్తుతి పలుకులు వల్లిస్తూ
కోరికలు తీర్చే వస్తువుగా... పరిగణిస్తున్నారు.
జనాభా లెక్కలకు మాత్రమే లెక్కిస్తున్నారు
మహారాణి అంటూ వంటింటి సామ్రాజ్యం కట్టబెడుతున్నారు.
కట్టుబాట్ల బంధనాలతో బంధీని చేస్తున్నారు
బావిలో కప్పల్లా బ్రతకడమేనా?
బయటి ప్రపంచంలోకి అడుగెట్టాలంటే... ఆంక్షలు
అభిమానాలు కాదు ఆత్మాభిమానాలను గౌరవిస్తే...
దేవతల రూపాలను కొలవడం కాదు...
కనులెదుట కదలాడే స్త్రీ దేవతలను గౌరవిస్తారు.
ఆ స్వప్నం నిజమవుతుందా...?

# నేటి బాల్యం... పాల బుగ్గలపై నీటి చారికలే



**ఎన్ నాగమణి,**
**ధైవందిన్నె**
**91770 37322**

ముద్దు మురిపాలతో మురిపించే బాల్యం
ఆటపాటలతో అలరించే బాల్యం
చెల్లీ... అన్నలతో గిలికజ్జాలు
వాన చినుకుల్లో చిందులాటలు
కాగితపు పడవలతో కేరింతలు
మేఘాలతో ముచ్చట్లు, వెన్నెలతో దాగుడుమూతలు
అమ్మమ్మ తాతయ్యల చందమామ కథలు
రాయికి, రత్నానికి తేడా చూడని బాల్యం
పచ్చదనాల పల్లె సోయగాల సుమ పరిమళమే నాటి బాల్యం
కానీ
నేటి బాల్యం
పేదోడి ఇంట్లో మెతుకులవేట
మేదోడి ఇంట్లో ఆశల పంట
అమ్మానాన్నల తీరికలేని జీవితాలతో
డబ్బాపాలతో ఆయాల పెంపకాలతో
కాంక్రీటు మనస్సుతో చైల్డ్‌కేర్ సెంటర్లలో
తడిలేని పొడిబారిన పలుకులతో
రాంక్ రేసులకై, పుస్తకాల పోరుతో
మస్తిష్కాల స్వారీలో కునికిపాట్ల మధ్య
ఉలికిపాట్లే నేటి బాల్య చిహ్నాలు!
ఎండమావుల వెంట పరుగుపందాలు
నేటి బాల్యం బహురూపాల్లో బలిపీఠాలే
అలసి సొలసిన పాలబుగ్గలపై నీటి చారికలే నేటి బాల్యస్మృతులు.

# స్వేచ్ఛాగీతం వినేదెప్పుడు



**మురళీధర్ పడకండ్ల,**
**నంద్యాల.**
**99592 37202**

ఎన్ని సంకెళ్ళను తెంచుకోను
కాళ్ళకు, కళ్ళకు కనురెప్పలకూ సంకెళ్ళే
మెదడుకు బలమైన సంకెళ్ళు
అమెరికా తాళంతో
స్వేచ్ఛా గీతం నేర్చే ఛాన్సేలేదు!
అన్నీ పాస్‌వర్డ్ అవసరమయ్యేటివే
లేకుంటే ఎడిట్ అయ్యేటివే
లేదంటే పసుపుపచ్చ తెరవేసి వున్నవే
సెక్షన్ 66ఎ సంకెళ్ళు తెగినాయి?
కనుసైగతో వేస్తున్న సంకెళ్ళు తెగేదెన్నడు?
మనువాద శిలాశాసనపు సంకెళ్ళపై కూర్చున్న న్యాయదేవత
గొంతు పెగలని నాకు బ్రెయిలీ భాషతో
నేర్పుతుందా! స్వేచ్ఛాగీతం
వినేదెప్పుడు స్వేచ్ఛాగీతం!

# ఆధార్

**పాణి, విరసం**
**కర్నూలు.**

ఈ పూట సెలవు పెట్టాల్సిందే
జరమొచ్చినా, మెడ పురి తిరుగుతున్నట్టున్నా
సయాటికా నగరంలో విద్యుత్ ప్రకంపనాలు
జల్... జల్‌మని తారెత్తించినా
నడుం వాల్చకుండా దాచుకున్న
వీక్‌ఆఫ్‌ను తృణప్రాయంగా వెచ్చించాల్సిందే
కాళ్ళు పీక్కుపోతున్నా
గొంతు తడారిపోతున్నా
మనోవాక్కాయ కర్మలతో క్యూలో నిలబడాల్సిందే
క్షణం ఏమారితే ఈ దేశంలో గల్లంతైపోయిన మానవుడ్నే
లే ప్రాయంలో ప్రేమ కూడా
ఇంతగా వెంటాడలేదు
ఎంత కాలమైందో ఊళ్ళో అమ్మా నాన్నల్ని
ఇంతగా తలపోసుకోక...
దేవుడి మీద నమ్మకం ఉన్న రోజుల్లో
వాడ్నీ ఇంతగా స్మరించుకోలేదు.
ఇప్పుడొకటే... ఆధార్.... ఆధార్
నగదు బదిలీ చేసినా చేయకపోయినా
గ్యాస్ ఇస్తే చాలు
రేషన్ ఇచ్చినా ఇవ్వకపోయినా
ఈ ఊళ్ళో నేనున్నట్లు లెక్కల్లో తేలితే చాలు
డెమోక్రసీలో ప్రభుత్వమంటే నావంటి ప్రజలకు ఏజెంట్
ఇప్పుడు నేనే రాజ్యంపై ఆధారపడిన విధేయ పౌరుడ్ని
విశ్వాసపాత్రమైన లబ్ధిదారుడ్ని

# మానవత్వం పరిమళించాలి



బి.వి. స్వరూప్ సిన్హా,
ప్రిన్సిపాల్
రవీంద్ర బాలికోన్నత
పాఠశాల, కర్నూలు
98661 37204

పుట్టిన బిడ్డ ఆడ బిడ్డంటూ
చెత్తకుండీలకు ఆహుతి చేసే
తల్లిదండ్రులు
తమను కన్నవారూ అలాగే పారవేసి
ఉంటే ఎక్కడుండే వారిప్పుడు?
నోరులేని పసిమొగ్గలు
కన్ను తెరవకుండానే అమ్మకడుపులో
కాలరాయబడుతుంటే
పశు పక్ష్యాదులకుండే
విచక్షణా జ్ఞానంలేని
మనిషి జన్మ, జీవకోటిలో
ఉత్కృష్టమైనదెలా అవుతండుది?
ఇది సాంకేతికత సాధించిన విజయమా?
దేశ పురోభివృద్ధికి చిహ్నామా?
కాదు-కాదు, కానేకాదు!
బంగాకె తల్లులను కన్నుల్లో
పెట్టుకుని కాపాడుకోవాలి
ఆది పరాశక్తి అవతారమైన
చిన్నారి దేవతలను పువ్వుల్లో
పెట్టుకుని పూజించాలి!
మానవత్వం పరిమళించాలి!
అప్పుడే మనిషి జన్మకు సార్థకత!
మానవ జాతికి బంగారు భవిత!

# Kurnool Kavitha

## Sankalanam

తెలుగులోగిళ్ళకు విద్యుత్ కాంతులనందిస్తున్న కర్నూలుసీమ ఈ కవితా సంకలనం ద్వారా విద్యుత్ కాంతులనందిస్తుంది. ఆధ్యాత్మిక క్షేత్రనిధి అయిన కర్నూలు సీమ యిప్పుడు ఆధునిక సాహిత్య కేంద్రంగా రూపుదిద్దుకొంటుందనడానికి ఈ సంకలనం ఒక ఆనవాలు

పెనుగొండ లక్ష్మీనారాయణ
జాతీయ కార్యదర్శి, అరసం

ఇందులోని కవితలు గాడి తప్పుతున్న రాజకీయాల్ని ఎత్తి చూపుతున్నాయి. వదులౌతున్న మానవ సంబంధాలను పటిష్టం చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. శ్రమశక్తిని కీర్తిస్తున్నాయి. విడిపోతున్న జనాన్ని కలపడానికి ప్రయత్నిస్తున్నాయి. 'తమసోమా జ్యోతిర్గమయ' అనే సంప్రదాయ భావనకు ఆధునిక వ్యాఖ్యానాలు ఈ కవితలు.

రాచపాళెం చంద్రశేఖర రెడ్డి
అరసం రాష్ట్ర అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్.




ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం
జిల్లాశాఖ - కర్నూలు